





# విజ్ఞానము

ఆధునిక,భౌతిక,జీవ,గృహ,వృక్ష

# రాజకీయ పరిజ్ఞానం





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆంధ్రచంద్రికా గ్రంథమాల—౬

# రాజకీయ పరిజ్ఞానము

గ్రంథకర్త

డాక్టరు మారేమండ రామారావు,
ఎం. ఏ., ఎల్. టి., పి ఎచ్. డి.

శ్రీ వాణీముద్రణాలయము
హైదరాబాదు (దక్కన్)

౧౯౪౧

వెల: చందాదారులకు రు. ౦—౧—౨—౦
ఇతరులకు ,, ౧—౦—౦

# విషయ సూచిక

# సంపాదకీయ భూమిక

మా ఆంధ్ర చంద్రికా గ్రంథమాలలో ఆరవకుసుమముగా "రాజకీయ పరిజ్ఞానము" అను గ్రంథమును ప్రకటింప గలిగి నందులకు మిగుల సంతసించుచున్నాము.

సుమారు రెండుశతాబ్దుల కాలము మనము నిరంకుశు లగు ప్రభువుల పాలనలోను, స్వార్థపరులయిన బ్రిటిషువారి దండనీతి ప్రధానాత్మక పరిపాలనలోను మ్రగ్గియుంటిమి. అప్పుడు పాలకులు శాసనములకు విధిగా తలయొగ్గుటయే మనకుగల హక్కుగా నుండెను. "ఆత్మవశమ్ సుఖమ్, పర వశమ్ దుఃఖ" మను ఆర్యోక్తిని గమనించి దుఃఖమయ మయిన ఈ పరవశమును విదళించుకొనుటకు గత ఏబది యేండ్లలో కాంగ్రెసు మహాసభ చేసిన ప్రచండ ఆందోళన మును, మహాత్మాగాంధీగారు నడిపించిన అహింసాబద్ధమగు స్వాతంత్ర్య సమరమును చరిత్రాత్మక మయిన విషయములు, ౧౯౪౭ ఆగస్టు ౧౫ వ తేదినాడు బ్రిటిషువారి ఇనుప పిడికిలి నుండి భారత దేశమునకు విముక్తి కలిగినది. భారత దేశము నకు స్వాతంత్ర్యము సిద్ధించినది. కృత్రిమ సరిహద్దులు అంత రించినవి.

ఏ దేశమునకయినను స్వాతంత్ర్యము సిద్ధించుట ఘన విషయమే, కాని అంతకంటె ఘనమయిన విషయము దానిని

సమర్థవంతముగా నిలువుకొనుట. ఇప్పుడు ఆసేతు హిమాచలమధ్యస్థ భూభాగమంతయు ఏకరాజ్యముగా, ప్రజారాజ్యముగా పరిఢవిల్లినది. కిరీటధారులగు నిరంకుశ ప్రభువుల యధికారము సన్నగిల్లినది. ప్రజానాయకులు ఇప్పుడు పరిపాలన సాగించుచున్నారు. అయితే పరిపాలనాభారమును వహించిన ఏ కొద్దిమందియో నాయకులేగాదు దేశములో నున్నది! ఇందు కోట్లకొలది ప్రజలున్నారు. ఈ ప్రజలు తమకర్తవ్యములను, బాధ్యతలను చక్కగా గుర్తించుకొన వలసియుండును. రాజ్యచక్రమును సకలజన క్షేమంకరముగా త్రిప్పజాలు నాయకులను ఎన్నుకొను "ఓటు" హక్కు ప్రజల హస్తగతమయి యున్నది. నాయకులు అధికారగర్వమున వికటకార్యములు సలుపకుండ జూచి, అరికట్టెడు విచక్షణాజ్ఞానము వీరు, వారు అనకుండ సమస్త ప్రజానీకము కలిగియుండ వలయును. ప్రజారాజ్యములో ప్రజలు జ్ఞానవంతులయినప్పుడే ప్రజారాజ్యరథము సరియయిన మార్గమున నడిచి సుఖమిచ్చును. ఆత్మవశంసుఖమ్మను ఆర్యోక్తికి తార్కాణముగా నుండగలదు. ప్రజలు స్వాతంత్ర్యశబ్దమునకు వికటార్థము గల్పించుకొని చిందులుత్రొక్కక రాజ్యాంగ ధర్మసూత్రములను అవగాహన చేసికొని, నిగ్రహముతో, దేశపరిపాలనా యంత్రమునందు తన స్థానమున నిలిచి ప్రతి యొక్కరుడు శాసనబద్ధముగ పనిచేయవలసి యుండును.

స్వతంత్ర దేశమునందలి స్వతంత్రపౌరుల
వివరించు గ్రంథజాలము ఆంధ్రభాషలో అరుదుగా

లీవని చెప్పినను అది సత్యదూరముకాదు. కావున ఏతద్విష యములను ఆంధ్ర సోదరులు గ్రహించి, ప్రతిభావంతముగ చరించెదరుగాక యను మహోద్దేశముతో "రాజకీయ పరిజ్ఞానము" అను నీగ్రంథమును బ్రకటించుచున్నారము.

ఇదియొక రాజకీయశాస్త్రము. పుస్తక రూపమున చిన్నదియేగాని ఇందలి విషయములు మహత్తరమయినవి. ఈ గ్రంథమునందు అత్యంతప్రాచీన కాలమునుండి యాధునిక కాలమువరకు రాజ్యతంత్ర వ్యవహారములు ఎట్టిపరిణామము లను పొందుచువచ్చినవో తెలుపబడినది. ముఖ్యముగా నేటిరాజ్య తంత్రక్రమము వేర్వేరుప్రకరణములయందు విశదీకరింపబడినది. గ్రామము మొదటి మెట్టుగానుండి, పరిపాలనా సౌకర్యము కొరకు దేశమెట్లు విభాజితమయి సోపాన పరంపర ఏర్పడునో, వీటిమధ్య నుండవలసిన పరస్పర సంబంధ మేమో చూపబడినది. ఓటు, ఎన్నికలు, మంత్రిమండలి నిర్మాణము, అధ్యక్షువరణము, శాసనసభలు మున్నగునవి. వానికి సంబంధించిన ఉపాంగ విషయములు వివరింపబడినవి. ప్రజలకు, ప్రభుత్వమునకు గల పరస్పరసంబంధములు, అధికారములు, కర్తవ్యములు, బాధ్యతలు, హక్కులు నిర్వచనము చేయబడినవి. మరియు, దేశదేశములందు బయలుదేరిన వేర్వేరు "వాదము"ల లక్షణములు, లక్ష్యములు తేటపరుపబడినవి. విషయపరిజ్ఞాన వికాసమునకయి ఇంగ్లండు, అమెరికా సంయుక్తరాష్ట్రములు, భారతదేశము, రష్యా—వీటియందలి పరిపాలనా ప్రణాళికలు సంగ్రహముగా

వర్ణింపబడినవి. ఈ మహద్విషయములన్నియు రాజకీయ విషయములనుగూర్చిన సరియైన విజ్ఞానమును మనవారలలో వికసింపజేయునని మేము విశ్వసించుచున్నాము. అప్పుడే "ప్రజలదే ప్రభుత్వము, ప్రజలచేతనే ప్రభుత్వము, ప్రజల కొఱకే ప్రభుత్వము" అను అబ్రహాం లింకను ఆశయము జయప్రదమయి సార్థకము కాగలదు.

ఈ యుద్గ్రంథ రచయిత డాక్టరు మారేమండ రామారావు పంతులు, ఎం. ఏ., ఎల్. టి., పి. ఎచ్. డి. గారు. శ్రీ రామారావుగారు చరిత్ర, శాసన పరిశోధనము, పురాతత్వశాస్త్రము, అర్థశాస్త్రము, రాజనీతిశాస్త్రము మున్నగువానియందు పేరుపొందిన పండితులు. ఇప్పుడు నిజాం కళాశాలయందు చరిత్రాధ్యాపకులుగా నున్నారు. వక్తలు. రచయితలు. ఇట్టి సమర్థులయిన వారు మాకోరికను మన్నించి మాకీగ్రంథమును వ్రాసి యిచ్చుట ఎంతయు ముదావహమగు విషయము. శ్రీ రామారావు పంతులుగారియెడ మేమత్యంత కృతజ్ఞతా బద్ధులమయి యున్నారము.

అచ్చుపనులు సత్వరముగా నిర్వహించిన వాణీముద్రణాలయాధికారులు శ్రీ నట్టె అప్పారావుగారు ప్రశంసార్హులు.

౨౧–౨–౧౯౪౧. సంపాదకుడు.

—౦—

గ్రంథకర్త



డాక్టరు మారేమండ రామారావు,

ఎం. ఏ., ఎల్., టి., పి. ఎచ్. డి.

# పీఠిక

ఇంగ్లీషువిద్యా విధానము ప్రవేశపెట్టబడుటకు ఫలితముగ పాశ్చాత్యుల విజ్ఞానశాఖలెన్నియో మనదేశమునందు ప్రచారములోనికి వచ్చినవి. వీనిలో పొలిటిక్సు (Politics) సివిక్సు (Civics) ఇకనామిక్సు (Economics) మున్నగునవి కలవు. ఈశాఖలన్నియు ఆయా దేశముల సాంఘికార్థిక రాజకీయాదిరంగముల పరిణామములతో కార్యకారణసంబంధము కలిగి యున్నవి. నేడు మనదేశపు రాజకీయనిర్మాణమును పాశ్చాత్యదేశముల రాజకీయనిర్మాణము ననుసరించుచున్నది. అందువలన పై విజ్ఞానశాఖల పరిచయమును కలిగియుండుట మనకును ముఖ్యావసరము.

నేటి పాశ్చాత్యవిజ్ఞానమంతయు ఇంగ్లీషులోను ఇతర విదేశీయభాషలయందును ఉన్నది. ఇది ఆంగ్లవిద్యాపరిచయముగల కొద్దిమందికిమాత్రమే అందుబాటులో ఉన్నది. జనబాహుళ్యమునకు దేశభాషలమూలమునగాని దానిపరిచయ మేర్పడ జాలదు. ఈ విజ్ఞానమునందు పొలిటిక్సు లేక రాజకీయపరిజ్ఞానము ఒక ముఖ్యశాఖ. ఆంధ్రభాష తెలిసినవారందరికిని ఈశాఖతో ప్రథమపరిచయమును కలిగించుకొనుట కుపకరించుటయే ఈ చిన్నపుస్తకముయొక్క ముఖ్యోద్దేశము.

ఈ పుస్తకమును రచింపుమని నన్ను ప్రోత్సహించిన శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికిని, దీనిని ప్రకటించిన ఆంధ్రచంద్రికా గ్రంథమాలాధికారులకును నా కృతజ్ఞత.

భాగ్యనగరము }
౧౩—౩—౧౯౪౧ }

మారేమండ రామారావు.

# రాజకీయ పరిజ్ఞానము

## మొదటి ప్రకరణము

ఆధునికులు విజ్ఞానము నంతటిని మానవకములు (Humanities) శాస్త్రములు (Sciences) అని రెండుగ విభజించినారు. ఇందు మానవకములు మానవునియొక్క ప్రవృత్తికి సంబంధించినవి. ఆదికాలమునుండి నేటివరకును మానవులు ఏయే సమయములయందు ఏయే విధముల వివిధ జీవితరంగములయందు ప్రవర్తించుచు వచ్చిరో ఈ విజ్ఞానభాగము తెలియజేయును. ఈ మానవకములలో చరిత్ర, ద్రవ్యశాస్త్రము, దండనీతి, నీతిశాస్త్రము, తత్త్వము మున్నగు విభాగములు కలవు. మానవహృదయము ఉద్రిక్తమై కొన్ని భావములు ప్రకటితములగును. ఈ ప్రకటనము అనేక రూపముల నుండును. ఈ రూపము లన్నియు లలితకళలు అని పిలువబడుచున్నవి. శాస్త్రములు మనచుట్టునుగల అనేకపదార్థముల యొక్క తత్త్వమును తెలుపును. భౌతిక, రసాయన, జంతు, వృక్ష శాస్త్రములు ఇట్టివి. మానవుడు శతాబ్దుల కాలమున ఎట్లు పరిణతి చెందుచు వచ్చెనో, ఏయే సమయములలో ఎచ్చట నేయేఘటనలు జరిగెనో తెలుపునది చరిత్రము. మానవులు తమ జీవితమునకు అవసరములగు వివిధవస్తువులను ఎట్లు నిర్మించుకొని, అనుభవించెదరో తెలుపునది ద్రవ్యశాస్త్రము. శాంతిభద్రతలను స్థిరముగ ననుభవించుటకై

మానవులు తమ సంఘమును ఎట్లు పాలించుకొనెదరో తెలుపునది రాజకీయపరిజ్ఞానము. వారు పరస్పరశ్రేయస్సు నెట్లు అభివృద్ధి పరచుకొననగునో తెలుపునది నీతిశాస్త్రము.

ఈగ్రంథమున రాజకీయపరిజ్ఞానము అని పేర్కొనబడిన శాస్త్రము ఇంగ్లీషు భాషలో పొలిటిక్స్ (Politics) అని ప్రసిద్ధి నందినది. ఈ పొలిటిక్స్ అను పదము "పొలీస్" అను గ్రీకుపదమునుండి యేర్పడినది. ప్రాచీన గ్రీసు దేశమునందు అనేక నగరములు ఒక్కొకటి ఒక్కొక ప్రత్యేక రాష్ట్రముగ నుండెడివి. ఇట్టిరాష్ట్రమునకు పొలీస్ అని పేరుండెడిది. ఈ రాష్ట్రముల నిర్మాణ నిర్వాహణములకు సంబంధించిన విషయములను చర్చించు విజ్ఞానమునకు పొలిటిక్స్ అని పేరు వచ్చినది. నేటి ఐరోపీయుల చరిత్ర సంస్కృతులు ప్రాచీన గ్రీసు దేశచరిత్ర సంస్కృతులతో ప్రారంభమగును. అందువలన వీరి భాషలలోనికి ఎన్నియో గ్రీకుపదములు వచ్చినవి. వీరి విజ్ఞానశాఖలలో ఆనాటి గ్రీకుల విజ్ఞానము చేరియున్నది. పొలిటిక్స్ అను పదమును, ఆ పేరబరగిన విజ్ఞానమును గ్రీకుల నుండి గైకొనబడినవి. రాష్ట్రములు కేవలమును నగరములుగమాత్రమే యుండక విశాలప్రదేశములను కలిగి యుండినవైనను, వీని నిర్మాణనిర్వాహణవిధానములు గ్రీకు నగరరాష్ట్రములకంటెను భిన్నములైననుకూడ వీనికి సంబంధించిన చర్చలకు పొలిటిక్స్ అను పేరు నేటివరకును వ్యాప్తిలో నుండుచునే వచ్చినది. ఐరోపీయవిజ్ఞానము విస్తరించిన

యితరఖండములవారును ఈ శాస్త్రమును ఈ పేరుతోనే వ్యవహరించుచున్నారు.

భారతదేశమునందు అతిప్రాచీన కాలమునుండియు ఇట్టివిజ్ఞానశాఖ వర్ధిల్లుచు వచ్చినది. ఇచ్చటకూడ నెందరో మేధావులు రాష్ట్రనిర్మాణ నిర్వహణములనుగూర్చి చర్చలు చేసి, తమ తమ నిర్ణయములను గ్రంథస్థముల నొనర్చిరి. ఈ విజ్ఞానశాఖ మన దేశమునందు దండనీతి, నీతి, నీతి శాస్త్రము, రాజనీతి, రాజధర్మము, అర్థశాస్త్రము అనెడి పేర్లతో ప్రసిద్ధి నందినది. దండమనగా యోగక్షేమసాధనము. నీతియనగా దానిని లభింపజేయునది. దండనీతియనగా యోగక్షేమమును సాధించుట కుపయోగపడు శాస్త్రము. అర్థమనగా బహుజనులు నివసించు భూమి. అట్టి భూమి యొక్క లాభపాలనోపాయములను తెలుపు శాస్త్రము అర్థ శాస్త్రము. ఆచార్య కౌటిల్యుడు, కామందకుడు, శుక్రుడు, బృహస్పతి, వైశంపాయనుడు మున్నగువారును, గౌతముడు, ఆపస్తంబుడు, మనువు, వసిష్ఠుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, కాత్యాయనుడు మున్నగు స్మృతికర్తలును ఈ విషయమై గ్రంథములను రచించినారు. క్రీ. పూ. ౪ వ శతాబ్దికి ముందే అనగా సుప్రసిద్ధమైన కౌటిలీయార్థశాస్త్రము రచింపబడుటకు పూర్వమే మన దేశమునందు ఈ శాస్త్రనిర్మాతలలో అనేకశాఖ లుండెడివి. కాత్యాయనుడు, కౌణపదంతుడు, చారాయణుడు, పిశునుడు, బాహుదంతీపుత్రుడు, కింజల్కుడు, ఘోటకముఖుడు, పరాశరుడు, పిశునపుత్రుడు,

భరద్వాజుడు, వాతవ్యాధి, విశాలాక్షుడు మున్నగువారు ఈయీశాఖలకు ప్రతిష్ఠాపకులు. ఇవిగాక వైదికవాఙ్మయము నను, భారత రామాయణములలోను, జైనబౌద్ధుల ప్రాకృత గ్రంథములలోను ఈ శాస్త్రమునకు సంబంధించిన చర్చలు కలవు.

ఈ రాజకీయ పరిజ్ఞానమునందు శాస్త్రభాగ మొకటియు, ఆచరణభాగ మొకటియు రెండుభాగములు కలవు. శాస్త్రభాగమున రాష్ట్రమన నేమి? దాని స్వభావ మెట్టిది? దాని లక్ష్యము లెట్టివి? దాని నెట్లు నిర్మింపవలెను? అందలి వివిధాంగము లేవి? రాష్ట్రమునకును అందలి పౌరులకును గల సంబంధ మెట్లుండవలెను? మున్నగు నంశములు చర్చింపబడును. ఆచరణభాగమునందు ఏయేకాలములలో ఏయే రాష్ట్రములు ఏయేవిధముల నిర్మింపబడి, నిర్వహింపబడినవో చర్చింపబడును.

ఈ శాస్త్రమునకును ఇతరమానవక విజ్ఞానశాఖలకును సన్నిహితమగు సంబంధము కలదు. వీనిలో మొట్టమొదట పేర్కొనదగినది చరిత్ర. చరిత్ర మానవసంఘముయొక్క జీవితములో అప్పుడప్పుడు జరిగిన ఘటనలను పేర్కొనును. ఏదైనను ఒకఘటన జరిగినప్పుడు అది యెందుకు జరిగినది? ఏకారణమువలన జరిగినది? దాని ఫలితము లెట్టివి? అను విచారము బయలుదేరును. ఒకొక్కప్పుడు కొన్నికొన్ని ఘటనలవలన కొన్నికొన్ని మార్పులు జరిగి, క్రొత్తక్రొత్త పరిస్థితు లేర్పడును. వీటినిగురించియు సవిమర్శకములగు చర్చ

లు జరుగును. ఇట్లు చారిత్రికఘటనలను విమర్శించుటవలన కార్యకారణసంబంధము గోచరమగును. ఉన్నపరిస్థితులు తృప్తికరములు కాకుండినయెడల సంస్కరణలను తెచ్చి, క్రొత్తపరిస్థితుల నేర్పరచుకొనవలసిన అవసర మేర్పడును. అట్టిసమయములలో పై కార్యకారణసంబంధ మాధారముగ అనేకవాదములు బయలుదేరును. ఈ విధమున చారిత్రకఘటనలును, రాజకీయవాదములును ఒకదాని కొకటి కార్యకారణ ఫలితము లగుచుండును. క్రీ. శ. ౧౮ వ శతాబ్ది చరమదశకమున ఫ్రాన్సు అను దేశమునందు రాజులు నిరంకుశులై, బాధ్యతారహితులై యేలసాగిరి. ప్రజలు అనేకబాధల ననుభవించుచుండిరి. జనబాహుళ్యము కూడుగుడ్డలు లేక అలమటించుచుండ కొద్దిమంది భూస్వాములు కులుకుచు తిరుగుచుండిరి. ఈ పరిస్థితులలో దేశము ప్రజలదేయనియు, దాని స్వామ్యమును వారిదేయనియు, దేశమునకు ప్రజలే పాలకులుగ నుండవలెననియు చెప్పు ప్రజాస్వామ్యసిద్ధాంతము నాటి తాత్వికులచేత విరివిగ ప్రచారము చేయబడెను. దీనికి ప్రతిఫలముగ ప్రజలందరును చేరి, బ్రహ్మాండమగు విప్లవమును బయలుదేరదీసి, తమ రాజును నిర్మూలించి, ప్రజాసత్తాకరాష్ట్రమును స్థాపించిరి. దీని నిర్మాణము చరిత్రలో మిక్కిలి ముఖ్యమగు సంఘటన. దీనికి ప్రజాస్వామ్యసిద్ధాంతము ముఖ్యమగు కారణము. ఇదేకాలమున ఉత్తర అమెరికాలో అనేక ఆంగ్లవలస లుండినవి. వీనిలోని ఆంగ్లప్రజలను వారి మాతృదేశమగు ఇంగ్లండులోని ఆంగ్లప్రభుత్వము పరిపాలించుచుం

డెను. క్రమక్రమముగ ఆ ప్రభుత్వము ఇంగ్లండుయొక్క ఆర్థికాభివృద్ధిని పురస్కరించుకొని వలసప్రజలపైని అనేక పన్నులను విధించుచు, వారికి పెక్కు ఇబ్బందులను కలిగించుచు బాధింపసాగెను. గత్యంతరములేక వలసలలోని ప్రజల ప్రతినిధులు ఒకచోట చేరి తమ స్వాతంత్ర్యమును ప్రకటించిరి. దీనిని తిరుగుబాటుగ పరిగణించి ఇంగ్లండు ప్రభుత్వము యుద్ధమునకు దిగెను. ఇదియే చరిత్రప్రసిద్ధమగు అమెరికా స్వాతంత్ర్యయుద్ధము. ఇందు వలసల ప్రజలు విజయము నందిరి. అన్యోన్య సహకారముతో ఈ విజయము నందిన వీరిలో స్వాతంత్ర్యానంతరముకూడ నీ సహకార మూండిన శ్రేయస్కరమను భావము ప్రబలినది. కాని ప్రతివలసకును తన వ్యక్తిత్వము పోకూడదను భావమును ప్రబలముగ నుండినది. ఈ భిన్నభావములను సమన్వయించి, సాముదాయకాభ్యుదయమును సాధించుటకై ఆప్రజలు ఫెడరలువిధానమను నొక నూతనమార్గము నవలంబించి, వలసల నన్నిటిని చేర్చి, యొక సాముదాయక పరిపాలనవిధానము నేర్పరచుకొనిరి. అంతటినుండియు "ఫెడరలిజం" (Federalism) అనునది ఒక రాజకీయవాద మైనది.

రాజకీయ పరిజ్ఞానమునకును "ఇకనామిక్స్" Economics) అని పిలువబడు ద్రవ్యశాస్త్రమునకును సన్నిహితమగు సంబంధము కలదు. మానవజీవితమునకు అవసరములగు వస్తువు లెట్లు నిర్మింపబడునో, అవి వానిని కోరువారికి ఎట్లు అందజేయబడునో ఈ శాస్త్రము తెలుపును. వ్యవసాయ

మును, పరిశ్రమలును ప్రభుత్వసహాయ ముండినచో బాగుగ సాగును. వస్తువుల ధరవరలు ప్రభుత్వములు ఎగుమతి దిగుమతులపై విధించు సుంకములమీద నాధారపడి యుండును. ప్రభుత్వము ఉదాసీనముగ నుండినయెడల పెట్టుబడిదారీ విధానము ప్రబలును. కర్షక పారిశ్రామిక విప్లవములు సంఘమున మార్పులు కలిగించి ప్రజలలో రాజకీయచైతన్యమును కలిగించి, ప్రజాస్వామ్యవాదమునకు దోహదము కల్పించినవి. అట్లే పెట్టుబడిదారీ విధానమునందలి లోపములకును, ప్రభుత్వముల ఔదాసీన్యమునకును ఫలితముగ సోషలిజం (Socialism), కమ్యూనిజం (Communism) వంటి సిద్ధాంతములు బయలుదేరినవి.

ఈ శాస్త్రమునకును నీతిశాస్త్రమునకునుకూడ సంబంధమున్నది. నీతిశాస్త్రము ఆదర్శమును చూపును. మానవులలో పరస్పరమును, సంఘమునకును వ్యక్తులకును, వ్యక్తులకును ప్రభుత్వమునకునుగల సంబంధములు ఎట్లుండవలెనో, ఎట్లుండిన న్యాయమో ఆ శాస్త్రము తెలుపును. రాష్ట్రము యొక్క పరిపాలనను ఆ ఆదర్శములను సాధించుటకు వీలగు మార్గముల నడిపింపవలెను. కేవలమును జీవించుటయే మానవుని పరమార్థము కాదు. ఆ జీవితము సుఖప్రదముగ నుండవలెను. అందులకు కొంత స్వాతంత్ర్య మవసరము. ఈ సుఖస్వాతంత్ర్యములు అందరికిని సమానముగ లభింపవలెను. నీతిశాస్త్రవిషయకములగు నీ యంశములు పౌరులయొక్కయు, ప్రభుత్వముయొక్కయు ప్రవృత్తిని నియమింపవలెను. నీతి

శాస్త్రమునకు విరుద్ధములు కాకుండగ నుండిననే ప్రభుత్వము యొక్క శాసనములకు పౌరులు వశంవదులై యుందురు.

ఈ విధమున రాజకీయ పరిజ్ఞానమను నీ శాస్త్రము రాష్ట్రముయొక్క నిర్మాణ నిర్వాహణములను గురించియు, పౌరులకును ప్రభుత్వమునకును ఉండదగిన సంబంధమును గురించియు తెలియచేయును.



# రెండవ ప్రకరణము

## కొన్ని ముఖ్యాంశములు

రాజకీయ పరిజ్ఞానము రాష్ట్రమునకు సంబంధించిన శాస్త్రము. రాష్ట్రమునకు నాలుగు ముఖ్యలక్షణము లుండవలెను. అవి ప్రదేశము, ప్రజలు, స్వామ్యము, ప్రభుత్వము అనునవి. ఇందు ఏయొకటి లోపించినను పరిపూర్ణమగు రాష్ట్రము ఏర్పడజాలదు.

ప్రదేశము (Territory) రాష్ట్రముయొక్క ప్రత్యక్ష రూపము. పౌరతకును, దేశభక్తికిని, పౌరులలోని సౌభ్రాతృత్వమునకును ఇదియే మూలము. దేశము నెడల ప్రేమ అందలిప్రజల ఐక్యతకు కారణ మగును. 'నాది' అని చూపగల దేశము లేక ఇతర లక్షణము లెన్నియున్నను రాష్ట్రము ఏర్పడ నేరదు. యూధులు (Jews) అను నొక తెగవారు కలరు. వారందరికిని ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒక ేవిధములగు ఆచారవ్యవహారములును కలవు. వారు సాముదాయకముగ నొకేప్రదేశమున నివసింపక అనేక దేశములలో చెదరి అల్పసంఖ్యాకులై నివసించుచున్నారు. వారికి ప్రత్యేకముగ నొక రాష్ట్రము లేక అనేకబాధల ననుభవించుచున్నారు. దేశముయొక్క విస్తృతికిని రాష్ట్రతకును సంబంధము లేదు. పూర్వము రాష్ట్రములు చిన్నచిన్నవిగ నుండెడివి. ప్రాచీనగ్రీసులో ఒక్కొక్క నగరమే ఒక్కొక్క రాష్ట్ర

ముగ నుండెడిది. క్రమక్రమముగ నీ చిన్నచిన్న రాష్ట్రము లంతరించి పెద్దపెద్దరాష్ట్రము లేర్పడినవి. రాష్ట్రము చిన్న దైనయెడల దాని పరిపాలనమును నిర్వహించుట సుకరమగును. పౌరులును పరిపాలనమున శ్రద్ధ వహించుటకు వీలగును. రాష్ట్రములు పెద్దవి అయినయెడల వాని పరిపాలనమును నిర్వహించుట కష్టసాధ్యమగును. ఎక్కువమంది పౌరులు ఆ విషయమై శ్రద్ధ వహించుటయు కష్టమగును. కాని రాష్ట్రములు మిక్కిలి చిన్నవి యగునెడల నితరులు వానిని సులభముగ నాక్రమింపగలుగుదురు. వాని ఆర్థికాభివృద్ధియు కష్టసాధ్య మగును. అందువలన రాష్ట్రములు అంత పెద్దవియు, అంత చిన్నవియు గాకుండగ నుండవలెను.

రాష్ట్రముయొక్క రెండవలక్షణము ప్రజలు. ప్రదేశము రాష్ట్రముయొక్క శరీరమగునెడల ప్రజలు దాని ఆత్మ. ఈ ప్రజలక్షేమమును, అభివృద్ధియునే రాష్ట్రప్రభుత్వముయొక్క ప్రవృత్తికి చోదకములు. ఆఫ్రికాఖండమునందు 'సహారా' అను పెద్ద యెడారి కలదు. అందు నేజీవమును బ్రతికి యుండజాలదు. నిర్మానుష్యమగు నా ప్రదేశమున నే రాష్ట్రమును స్థాపింపబడనేరదు.

ప్రభుత్వము రాష్ట్రముయొక్క మరియొక లక్షణము. నేడు కొండలలోను, అడవులలోను అనేక తెగలవారు నివసించుచున్నారు. వారిజీవితము 'ఎవరికి వారే యమునాతీరే' అనునట్లుండును. వారిలో రాజకీయచైతన్యముగాని, పౌరభావముగాని లేదు. అందువలన నియమితమగు ప్రదేశమును,

దానిపై నివసించు ప్రజలును ఉన్నను వారిలో రాష్ట్రము లేర్పడలేదు. ఒకేచోట నివసించుచున్న ప్రజలు పరస్పరరక్షణకొరకును, శాంతిభద్రతలకొరకును, కొన్ని కట్టుబాట్లు నేర్పరచుకొని, ఒక పరిపాలనవిధానమును, ప్రభుత్వమును కలిగియుండిననే రాష్ట్ర మేర్పడును.

రాష్ట్రముయొక్క నాల్గవ ముఖ్యలక్షణము స్వామ్యము స్వామ్యమనగా రాష్ట్రములోపల కార్యములను నిర్వహించుకొనుటలో పరిపూర్ణమగు స్వేచ్ఛ, రాష్ట్రము వెలుపల నెవరికిని లోబడియుండక ఇతరరాష్ట్రములతో సంబంధములను ఉంచుకొనుటకుగాని త్రెంచుకొనుటకుగాని పూర్తియైన స్వాతంత్ర్యము నని యర్థము. నిన్న మొన్నటివరకును భారత దేశమునకు, రాష్ట్రతకు ఉండవలసిన మూడు లక్షణములు వర్తించినవి. నాల్గవదగు స్వామ్యమును ఆంతరవిషయములలో వర్తించుచునే వచ్చినది. దేశములోపల అన్నివిషయములందును బాధ్యత వహించి కేంద్రప్రభుత్వము తన యిచ్ఛానుసారము పరిపాలనమును సాగించుచు వచ్చినది. కాని యితర దేశములతో సంబంధబాంధవ్యములను సాగించుటలోమాత్రము అది ఆంగ్లప్రభుత్వమునకు లోబడి యుండవలసి యుండెడిది. ౧౯౩౯ లో మన అంగీకారముతో నిమిత్తములేకయే బ్రిటిషువారు మన దేశమును యుద్ధములోనికి ఈడ్చిరి. మన దేశ పరిపాలనమున ప్రధానాధికారిగనుండిన గవర్నరుజనరలు ఆంగ్లదేశప్రభుత్వమున కుత్తరవాదిగనుండి ఆ ప్రభుత్వముచేతనే నియమింపబడుచు వచ్చెను. ఈ విధమున మనకు

స్వామ్యము లోపించెను. అందువలననే ౧౯౫౦ వ సంవత్స రము జనవరి ౨౬వ తేదీనుండియే మనది పరమస్వామ్యసహిత రాష్ట్రమైనది. నేటి మన ప్రభుత్వము మనది. దానిని మనము మన యిష్టము వచ్చినట్లు మార్చుకొనవచ్చును. మన ప్రధాన పరిపాలకుడు మనము ఎన్నుకొనినవాడు. మరి యెవ్వరి విధి నిషేధములతోడను నిమిత్తము లేక మనము ఇతర దేశము లతో సంబంధముల నుంచుకొనవచ్చును లేదా మానుకొన వచ్చును.

రాష్ట్రమునకును సమాజమునకును కొన్ని సాదృశ్య వైదృశ్యము లున్నవి. మతమునుబట్టియు, భాషనుబట్టియు, ఆచారవ్యవహారములనుబట్టియు, అభిరుచులనుబట్టియు మానవులలో అనేక సంఘము లేర్పడును. రాష్ట్రమును, శాంతి భద్రతల రక్షణకొరకు ఏర్పడిన ఒక సంఘమే. కాని ఇతర సంఘములదృష్టి పరిమితమైనది. వానికి అందలి సభ్యులతోనే సంబంధ ముండును. ఈ సంఘములలో పరస్పరమును వైష మ్యములు కలుగవచ్చును. రాష్ట్రముయొక్క దృష్టి విశాల మైనది. పై వివిధసంఘము లనేకములు రాష్ట్రమున నిమిడి యుండును. రాష్ట్రము వ్యష్టిగను, సమిష్టిగనుకూడ పౌరులం దరి యోగక్షేమమును సాధించును. ఈ యితరసంఘముల అధికారము రాష్ట్రాధికారమునంతటి నిశితమును, నిశ్చిత మును కాజాలదు. ఈ సంఘములలో వేనియందైనను సభ్య తను గోల్పోయినయెడల నెవరికిని అంత బాధ కలుగదు. కాని రాష్ట్రమునందలి పౌరతను గోల్పోయిన వ్యక్తి బహు బాధలకు లోనగును.

ప్రభుత్వమునకును రాష్ట్రమునకును దగ్గరసంబంధ మున్నది. రాష్ట్రము కంటికి కనపడదు. ప్రభుత్వము ప్రత్యక్ష ముగ కనిపించును. ప్రభుత్వము తాత్కాలికముగ రాష్ట్రము యొక్క స్వరూపము. అది రాష్ట్రముయొక్క సర్వాధికార ములను చలాయించును. పరిస్థితుల ననుసరించి ప్రభుత్వము మారును కాని రాష్ట్రము మారదు. ఈ రెండిటికిని నియమిత నియామకసంబంధ ముండును.

జాతీయతకును రాష్ట్రమునకును సంబంధ మున్నది. ఒకే జాతికి చెంది, ఒకే భాషను సంస్కృతిని మతమును ఆచారవ్యవహారములను కలిగియుండిన వ్యక్తులు సామాన్య ముగ కలసి యుందురు. వారిలో ఐక్యత యుండును. వారిలో పరస్పరమును అనురాగ ముండును. వారిలోవారికి గల సాదృశ్యములును, ఇతరులతో గల వైదృశ్యములును వారికి తెలిసియుండు. ఈలక్షణములు గల ఐక్యభావమునకు జాతీ యత అని పేరు. ఇట్టి భావముగల వ్యక్తులందరును చేరి యొక రాష్ట్రముగ నేర్పడిన యెడల నది ఆదర్శరాష్ట్రముగా నుండును. కొంతకాలము ఇట్టిరాష్ట్రము లేఉండినవి. కాని క్రమ క్రమముగ వివిధజాతుల వారు కలిసిపోయి ఒకే ప్రదేశమున నివసింపసాగిరి. అందువలన భాషావైవిధ్యమును, మతవైవిధ్య మును కూడ నేర్పడినవి. వీరిలో బలవంతులగువారు ఇతరు లను జయించుటవలనను, పైనుండి యింకొకరు వచ్చి వీరంద రిని జయించుటవలనను ఈవైవిధ్యములతో ప్రత్యేకరాష్ట్రము లేర్పడుట జరిగినది. భిన్నభిన్నరాష్ట్రములు చేరి ఫెడరలు

విధానములుగ నేర్పడినవి. నేటి అమెరికాసంయుక్తరాష్ట్రములలో అనేక జాతులవారు కలరు. స్విట్జర్లండ్ అను చిన్న రాష్ట్రమున మూడు భాషలను మాట్లాడు ప్రజ లున్నారు. మనదేశమున అనేకజాతులకును, అనేక భాషలకును, అనేక మతములకును చెందిన జనులు కలరు. నేడు అన్నిరాష్ట్రములలోను భాషావిషయకముగనో, మతవిషయకముగనో అల్ప సంఖ్యాకులగువారు కలరు. ఈ మిశ్రితరాష్ట్రములకు ఏకజాతి రాష్ట్రములకుగల బలమును, ఐక్యతయు, శాంతియు ఉండదు. దీనికి మనదేశమునందలి ప్రాంతముల నిర్మాణము నిదర్శనము. పూర్వము బ్రిటిషువారు ప్రజల భాషలతోను, మతములతోను నిమిత్తము లేక అప్పుడప్పుడు లభించిన ప్రదేశములను ఒక్కొక కేంద్రమునకు చేర్చుచు కృత్రిమప్రాంతముల నేర్పరచిరి. ప్రజలలో రాజకీయచైతన్యము వృద్ధియగుటతో జాతీయభావము ప్రబలినది. ఈ కలగూరగంపరాష్ట్రములను విడగొట్టి భాషలు ప్రధానములుగ ప్రాంతములను నిర్మింపవలెనను వాదము ప్రబలినది. ఇట్టి ప్రాంతములలో ఐక్యత పెంపొంది, మొత్తము రాష్ట్రమంతటికిని బలము చేకూరును. ఈరోజులలో జీవితము క్లిష్టము, క్లిష్టతరము నగుచున్నది. ఆర్థికశక్తి సర్వశక్తులను, సర్వభావములను కబళించుచున్నది. దారుణమైన పోటీ ప్రతిజీవితరంగమునను ప్రవేశించినది. ఎవరిమటుకు వారికి తాము సుఖప్రదముగ

జీవింపగలుగుటయే దుర్ఘట మగుచున్నది. మరియొకవంక, ప్రపంచమంతయు ఒకే రాష్ట్రముగ నేర్పడవలెననియు, ప్రత్యేకస్వామ్యరాష్ట్రము లుండరాదనియు ప్రచారము జరుగుచున్నది. వీటి యొత్తిడికి జాతీయభావము నలిగి క్షీణించుచున్నది.



# మూడవ ప్రకరణము

## రాష్ట్రోత్పత్తి

రాజకీయపరిజ్ఞానముయొక్క స్వభావమును, రాష్ట్రముయొక్క ముఖ్యలక్షణములను వెనుకటి ప్రకరణములలో చెప్పియుంటిమి. ఈ ప్రకరణమున రాష్ట్రముయొక్క ఉత్పత్తి క్రమము తెలుపబడును.

రాష్ట్రోత్పత్తినిగురించి అనేకవాదోపవాదములు జరిగినవి. ఇవి రాష్ట్రస్వభావమును, రాష్ట్రప్రవృత్తిని, స్వామ్యలక్షణమును నిర్ణయించుట కుపయోగపడును. ఈ సందర్భమున బయలుదేరిన వివిధవాదములలో ముఖ్యములగువాని నీక్రింద పేర్కొనుచున్నాము.

### మాతృపాలకవాదము.

అనేకదేశములలో ఆదిమస్థితిలో పురుషులు బహుపత్నీకులుగ నుండిరి. వారికి భార్యలందరివలనను బిడ్డలు కలుగుచుండిరి. వారు ఈ బిడ్డలను భార్యలనుబట్టియే గుర్తించుచుండిరి. బిడ్డలును సన్నిహితవర్తినియగు తల్లియెడలనే ఎక్కువ ప్రేమానుబంధములను కలిగియుండెడివారు. ఇట్టి కుటుంబములలో సంబంధములన్నియు స్త్రీమూలముగనే పరిగణింపబడుచుండెడివి. ఈ కారణములవలన తల్లికి పలుకుబడి హెచ్చి ఆమెయే కుటుంబమునకు యజమాని అయ్యెను. ఇట్టి కుటుంబములనుబట్టియే ఒకయేలికకు లోబడిన ప్రజలు

గల రాష్ట్ర మేర్పడెనని యీ వాదముయొక్క సారాంశము. మాతృపాలికత్వము మానవసంఘముయొక్క పరిణామము నందు ఒక అవస్థ యైన కావచ్చును కాని అది అన్ని దేశము లయందునుగాని అన్నికాలములయందునుగాని వ్యాపించి యుండలేదు.

## పితృపాలకవాదము.

ఆలుమగలతో కుటుంబము ప్రారంభమగును. క్రమ ముగ వారికి పిల్లలు కలుగుదురు. ఈ బిడ్డలు తల్లిదండ్రు లిద్దరి పర్యవేక్షణమునను పెరుగుదురు. కష్టపడి జీవనోపాధిని సంపాదించు తండ్రి యీ కుటుంబమునకు యజమానిగ నుం డును. ఈ బిడ్డలు పెద్దవారై వారును కుటుంబీకు లగుదురు. అయినను వారి కుటుంబములకు కూడ వారి తండ్రియే పెద్దగ నుండును. అతనివెనుక నతని పెద్దకుమారుడు యజమానియై శాఖాకుటుంబముల యోగక్షేమమును విచారించుచుండును. ఈ శాఖాకుటుంబములు చెదిరి అనేకచోట్ల స్థిరపడును. తర ములు గడచినకొలదియు నివి యాక్రమించు ప్రదేశము పెరుగును. ఆదిమకుటుంబములోని జ్యేష్ఠపుత్రుని సంతతివారే అగ్రజాతధర్మము ననుసరించి (Primogeniture) యజమాను లగుచుందురు. కాలక్రమమున నీప్రదేశ మొక రాష్ట్రముగ నేర్పడును. ఇది యీ వాదముయొక్క సారాంశము. ఈ వాదము రాష్ట్రము లేర్పడుటకు రక్తసంబంధము ఒక ముఖ్య కారణమనిమాత్రము తెలుపును. విజయములమూలమునను, సమయములమూలమునను, ఫెడరలుమార్గమునను రాష్ట్రము

లేర్పడుటను చరిత్ర నిరూపించుచుండుటవలన పితృపాలకమే రాష్ట్రోత్పత్తికి కారణమని చెప్పుటకు వీలుపడదు.

## దైవికవాదము.

ప్రజల యోగక్షేమాభివద్ధికై దైవమే రాష్ట్రముల నేర్పరచుననియు, అతడే రాష్ట్రముయొక్క పాలకునిగూడ నిర్ణయించుననియు ఈవాదముయొక్క సారాంశము. దీని నుండి రాజు దైవమునకే బాధ్యుడనియు, ఆతని శాసనములను శిరసావహించుట ప్రజలకు దైవనిర్ణీతమైన విధియనియు, వ్యాఖ్యలు బయలుదేరినవి. కొందరు మతభోధకులు రాజుల నిరంకుశాధికారము బాధాకరమేయైనను, దానిని సహించి బాధలననుభవించుట మానవుని ఆధ్యాత్మికశిక్షణలో నొక భాగమనియు ప్రచారము చేసిరి. ఈ దైవికవాదము ఐరోపాలో ౧౭ వ శతాబ్దిలో విశేషప్రచారము నంది, రాజుల నిరంకుశ పాలనకు కారణమైనది. మన శ్రీమద్భారతమునందును ఇట్టివే రెండు గాధలు కలవు. అందొకదాని ననుసరించి, దేశము నందు అరాజకము ప్రబలగా మనుష్యులు విష్ణువుతో మొర బెట్టుకొనిరట. అతడు విరాజనుని వారికి రాజుగ బంపెనట. అతని సంతతివారు క్రమముగ రాజత్వమును సాగించిరట. రెండవగాధననుసరించి, ప్రజలు బ్రహ్మతో మొరబెట్టుకొనగ నతడు మనువును వారికి రాజుగ బంపెనట. ఈ వాదము ఊహాధారమే కాని చారిత్రకముగ సత్యమైనది కాదు. ప్రజా స్వామ్యవాదమును, ప్రజాసత్తాకములును ప్రబలిన మీదట

రాజులు నామమాత్రులైనారు. అదియునుగాక అనేక రాష్ట్రములను ప్రజలే నిర్మించుకొనినారు.

బలవాదము.

మానవులందరును ఒకేతీరుగ నుండరు. వారిలో కొందరు బలవంతులును, కొందరు బలహీనులునై యుందురు. కొందరు మేధావులును, కొందరు మందులునై యుందురు. ఆదిలో బలవంతులగువారు బలిమిచేత బలహీనులపై పలుకుబడిని, అధికారమును సంపాదింతురు. మేధావియైనవాడు ఇతరుల ననేక విధముల వంచించి వశపరుచుకొనును. క్రమక్రమముగ నీ బలవంతులు పెద్ద సిబ్బందిని తయారు చేసికొని విశాలములగు ప్రదేశములకును, బహుసంఖ్యాకులగు ప్రజలకును ఏలిక లగుదురు. జీవితము క్లిష్టము కానుకాను వృత్తి విభజన మేర్పడును. ఇందు సైనికవృత్తి నవలంబించువారికి పలుకుబడి యేర్పడి వారు బలవంతులగుదురు. ఒకప్పుడు కొందరు ప్రజలు తమదేశమును వదలి మఱియొక దేశమునకు పోయి బలిమిచే అచటివారిని ఓడించి, వారిపై అధికారమును స్థాపించెదరు. కొన్నిసమయములలో ఒకదేశపు ఏలిక మఱియొక దేశమును జయించి పరిపాలించును. ఇట్లు అనేకవిధముల బలప్రదర్శనమువలన రాష్ట్రము లేర్పడును. ఇది యీ వాదముయొక్క సారాంశము. యుద్ధముల మూలముననుా, విజయముల మూలమునను అనేక రాష్ట్రము లేర్పడినమాట నిజమే. కాని యిట్టి బలాధారములగు రాష్ట్రములు చిరకాలము నిలువలేదు. పాలకులు బలహీనులగుటతో అవి

ఛిన్నభిన్నము లైనవి. ఈవాదమునందు కొంత సత్యమున్నను బలముమూలముగనే రాష్ట్రోత్పత్తి జరిగెనని చెప్పుట సమంజసము కాదు.

పౌరోహిత్యోత్పత్తి.

పూర్వము గ్రీసు, రోము మున్నగు దేశములలో మతము నెడల మిక్కిలి శ్రద్ధ యుండెడిది, ఎవరియింట వారు వారివారి కులదైవతముల నారాధించినట్లే నగరములలోను, రాష్ట్రములలోను సాముదాయకముగ కొందరు దేవతల నారాధించుట ఆకాలమున ఆచారముగ నుండెను. ఇట్టి యారాధనలను రాజులే జరిపెడివారు. నేటికిని కొన్ని తెగలలో నాయకులే ప్రధానపురోహితులు. దేవతల విషయమై తప్పు జేసినవారిని వారే దండింతురు. అందువలన ప్రధానపురోహితుడుగ నుండి మత విషయములయం దధికారమును సాగించిన వ్యక్తియే క్రమముగ ఐహికవిషయములయందును అధికారమును సంపాదించి రాజుగ మారెను. ఇది యీ వాదము యొక్క సారాంశము.

సమయవాదము.

ఈ వాదము రాష్ట్రోత్పత్తికి సంబంధించినవాదముల లోనెల్ల మిక్కిలి ముఖ్యమైనది. ౧౬,౧౭,౧౮ శతాబ్దములలో ఐరోపాలో జరిగిన రాజకీయచర్చ లన్నిటియందును ఇది ప్రాధాన్యమును వహించినది. రాష్ట్రమేర్పడుటకు పూర్వము మానవులు ఒక స్థితియం దుండిరి. దానికి ప్రాకృతస్థితి అని

పేరు. కొంతకాలమైనపిమ్మట వారు ఒక ఒడంబడికను లేక సమయమును (Contract) చేసికొని, తమ్మూలమున రాష్ట్రము నేర్పరచుకొని, అందు నివసింపసాగిరి అనునది యీ వాదము నందలి ముఖ్యభాగము. ఇందలి ప్రతి అంశమునుగూర్చియు అభిప్రాయభేదము లేర్పడినవి. వాదోపవాదములు జరిగినవి. వీనిలో హాబ్స్ (Hobbes), లాక్ (Locke), రూసో (Rousseau) అను ముగ్గురు తాత్త్వికుల వాదములు ముఖ్యములు. హాబ్సువాదము:— మానవుడు స్వార్థపరుడు. అతని ప్రవృత్తి భౌతికములగు తృష్ణలవలననే నియమింపబడును. ఈ తృష్ణలను తీర్చుకొనుటయే అతని ముఖ్యాశయము. ఆ సందర్భమున మేధయు, యుక్తాయుక్త విచారమును అంతగా ప్రధానములు కావు. ప్రాకృతస్థితియందు మానవులు ఇట్లుండుట వలనను, వారి నందరిని అదుపుఆజ్ఞలలో నుంపగల అధిష్ఠాతయెవడును లేకుండుటవలనను ఈ స్థితియందు నిరంతరము ను పోరాటము సాగుచుండెను. ప్రతివ్యక్తియు ప్రతి యితరుని తోడను, మొత్తముమీద నందరితోడను స్పర్థించుచు, పోరాడుచు తనను తనవారిని, తన ఆస్తిపాస్తులను రక్షించుకొనుచుండెను. కొందరు ఇతరుల మెప్పుపొందుటకై బల ప్రదర్శనము చేయుచుండిరి. కొందరాత్మతృప్తికై బలమును చూపుచుండిరి. ఎవరికెవరు శత్రువులో, మిత్రులో తెలియక ప్రతివారిని భయమును, అనుమానమును బాధించుచుండెడివి. న్యాయము, ధర్మము అనునవి ఈ స్థితియందుండవు. కొంతకాలమైనపిమ్మట నిట్టిస్థితి దుర్భరమై ప్రతి

వారికిని దీనినుండి బయటపడి యింతకంటెను తృప్తికరమగు స్థితి నేర్పరచుకొనవలెనను కోరిక కలుగును. అంతట ప్రతి వ్యక్తియు ప్రతియితరవ్యక్తివద్దకును పోయి "నన్ను నేను పరిపాలించుకొను అధికారమును ఫలానావ్యక్తికి నప్పగించు చున్నాను. నీవును అట్లే చేసి, అట్లు నప్పగింపబడిన అధికారమును ఈవ్యక్తి చలాయించుటకు అనుమతింపవలెను" అని చెప్పి ఒక ఒడంబడికను లేక సమయమును చేసికొనును. దీనికి ఫలితముగ రాష్ట్ర మేర్పడును. దీనినిబట్టి రాష్ట్రము పౌరుల స్వేచ్ఛాంగీకారముమూలమున నేర్పడెనని స్పష్టమగు చున్నది. రాష్ట్రముతోపాటే ప్రభుత్వమును ఏర్పడినది. సమయము నేర్పరచుకొనినవారు వ్యక్తులు. అందువలన ప్రభుత్వము సమయబద్ధము కాదు; దానికి అతీతము. వ్యక్తులు తమ అధికారము నంతటిని దానికి వశపరచుటవలన దాని అధికారము అపరిమితము. రాష్ట్ర మేర్పడినతర్వాత వ్యక్తుల కెట్టి అధికారమును ఉండదు. ప్రభుత్వము ఇచ్చిన హక్కులు మాత్రమే వారికి చెల్లును. పౌరులు ప్రభుత్వమునకు వశపరచిన అధికారమును వారు తర్వాత రద్దుపరచుటకు వీలు లేదు. రాష్ట్రమునందు స్వామ్యము ప్రభుత్వమునకే వర్తించును. అందువలన ప్రభుత్వపు శాసనములు అనుల్లంఘ్యములు. పౌరులు వానిని అనుసరించి తీరవలెను. ఒకసారి యేర్పరచుకొనిన యీ సమయమును పౌరులు ఏ పరిస్థితులయందును రద్దుపరచలేరు.

హాబ్స్ ప్రతిపాదించిన యీ వాదము రాజత్వమునకును, నిరంకుశత్వమునకును దోహద మొసగినది. దీనికి ఫలితముగ ౧౭, ౧౮ శతాబ్దములలో ఐరోపాఖండమునందలి రాజులు నిరంకుశముగ పాలింపసాగిరి.

## లాక్ వాదము.

ప్రాకృతస్థితియందు వ్యక్తులందరును స్వతంత్రులుగను, సమానులుగను ఉండిరి. వారి ప్రవృత్తి యుక్తాయుక్తతల ననుసరించి యుండెడిది. ప్రతివ్యక్తికిని తనను, తన ఆస్తిపాస్తులనే రక్షించుకొనవలెనను భావముతోపాటుగ ఇతరులును వారి ఆస్తిపాస్తులునుకూడ రక్షింపబడవలెననియు, వానికి కష్టనష్టములు కలుగకూడదనియుకూడ కోరిక యుండెడిది. ఈ యుక్తాయుక్తజ్ఞానమే సాముదాయకక్షేమమును కల్పించెను. ఇందుమూలముననే యెల్లరును తమతమ హక్కులను అనుభవింపగలిగిరి. కాని ఈ యుక్తాయుక్తజ్ఞానము అనిర్దిష్టము. అందువలన దీనిని ఎవరికి తోచిన విధమున వారు వ్యాఖ్యానించుకొనిరి. దీనిని ఇదమిత్థమని నిర్వచించి చెప్పి, దీనికి విరుద్ధముగ నడచువారిని దండించి, పరిపాలించు అధిష్ఠాత లేకుండుటవలన కొంత అసౌకర్యమును, కొంత అనుమానమును ఉండెడివి. వీనిని పోగొట్టి, జీవితమును సుఖప్రదమొనర్చుకొనుటకై వ్యక్తులు రాష్ట్రము నేర్పరచుకొనిరి. ప్రతియొకవ్యక్తియు ప్రతి యితరవ్యక్తితోను "మన సాముదాయకక్షేమమును రక్షించు నా అధికారమును మన సమాజమునకు వశపరచుచున్నాను. నీవును అట్లు చేయుము.

అందుమూలమున స్వేచ్ఛయు, ఆస్తిపాస్తులును సురక్షితము లుగ నుండును'' అని ఒక సమయమును చేసికొనుటవలన రాష్ట్రమేర్పడును. లాక్ యొక్క ఈ వాదమునుబట్టి పౌరులు తమ అధికారమునంతటిని కాక కేవలమును సాముదాయక క్షేమ నిర్వహణాధికారమునే విడచిపెట్టిరని స్పష్టమగుచున్నది. అప్పుడు వారి యితరహక్కులన్నియు వారికే నిలచి యుండును. ఈ హక్కు ఏవ్యక్తికిని గాక సమాజమునకు ఈయబడినది. అందువలన స్వామ్యము సమాజమునకు చెందును. దీనిని పాలించుటకు ఒక శాసనకర్తృక మేర్పరుప బడును. అది ప్రభుత్వమును సాగించును. ఒకవేళ నీ శాసన కర్తృకము తన విధులను సవ్యముగ నిర్వహింపనియెడల ప్రజలు దీనిని మార్చి మరియొకదాని నేర్పరచెదరు.

రూసో వాదము.

మానవుడు స్వాభావికముగ మంచివాడు. ఆదిమస్థితి యందు అందరును స్వేచ్ఛగను, సమానముగను, మంచివారుగను ఉండిరి. అప్పుడు మానవజీవితము మిక్కిలి సుఖప్రదమై ఆదర్శప్రాయముగ నుండెను. కాలక్రమమున జనసంఖ్య పెరిగినది. ఆస్తిపాస్తులు వృద్ధియైనవి. అందువలన పరస్పరవైషమ్యములు బయలుదేరినవి. ఎవరిస్వేచ్ఛను వారికి ఉంచుచు, సాముదాయకశక్తిలో ప్రతివానిని రక్షించుట యెట్లు? అను సమస్య బయలుదేరినది. అంతట వ్యక్తులు తమ సర్వాధికారములను సమాజమునకు వశపరచిరి. ఈ సమాజమునందే స్వామ్యము ప్రతిష్ఠింపబడినది. సమాజముయొక్క సాముదా

యకాభిప్రాయము ఈస్వామ్యమును వ్యక్తీకరించును. అందు ప్రతివ్యక్తియొక్కయు ప్రత్యేకాభిప్రాయము చేరియుండును. శాసననిర్మాణము సమాజముయొక్క విధి. అది వానిని అమలుపరచుటకై ప్రభుత్వము నేర్పరచును. ప్రజలును, వారి సమాజమునే స్వామ్యమును కలిగియుందురను రూసోయొక్క వాదము ప్రజాస్వామ్యసిద్ధాంతమునకు పునాది అయినది. రాష్ట్రము వేరు, ప్రభుత్వము వేరు, ప్రభుత్వము సమాజము యొక్క నిర్మాణము అను అతని సిద్ధాంతము దుష్ప్రభుత్వమును నిర్మూలించుట కవకాశము నేర్పరచి విప్లవతత్వమునకు దోహద మొసగినది. స్వామ్యమును సమాజమున ప్రతిష్టించి రూసోదానిని, తద్రూపమైన రాష్ట్రమును నిరంకుశము నొనర్చినాడు. పాలితుల అంగీకారముకాని బలము రాష్ట్రముయొక్క మూలాధారముకాదు అను అతని అభిప్రాయము పౌరధర్మమును విశదీకరించును.

ఈ సమయవాదము అనేక ముఖ్యవాదములకు కారణమైనది. అయినను దానియందు సత్యము అంతగ లేదు. చరిత్రను పరిశీలించినయెడల ఆదిలో మానవులు ఏదియోవిధమున నొక వ్యక్తియొక్క అధికారమునకు లోనయియుండినప్పుడే రాష్ట్రములు ఉద్భవించెనని తెలియనగును. ఇట్టి రాష్ట్రముల అనంతరపరిణామమునందు సమయము ఏర్పడి

తన్మూలమున రాష్ట్రస్వరూపము మారినది. అంతియకాని ఆదికాలమునందు అవి సమయము మూలముననే ఏర్పడిన నిదర్శనము కాదు. ప్రాకృతస్థితియందు మానవులందరును సమానులుగను, స్వేచ్ఛగను ఉండిరను సమయవాదమునందలి ముఖ్యసూత్రము సత్యదూరము. ఆస్థితియందు బలమును బట్టియు, తెలివితేటలనుబట్టియు, వారివారి కుటుంబములను బట్టియు, హోదాలనుబట్టియు జనులలో అనేకభేదము లుండెడివి. నేడుకూడ వర్గభేదములును, వర్ణభేదములును కలవు. వీటిమూలమున స్వేచ్ఛ కొందరికి ఎక్కువగ నుండుటయు, కొందరికి తక్కువగ నుండుటయు జరుగుచున్నది. వాస్తవముగ పరిపూర్ణములగు స్వేచ్ఛాధికారములు లేనివారు వానిని సమాజమునకు వప్పగించుచు సమయము చేసికొనుట సంభవింపనేరదుగదా! అదియునుగాక ప్రాకృతస్థితివంటి అపరిణతమగు స్థితిలో నుండువారికి సాముదాయకక్షేమమును గురించియు, వ్యక్తిక్షేమమునకును సమాజక్షేమమునకును గల అద్వైతస్థితినిగురించియు ఆలోచించుటకు అవసరమగు రాజకీయచైతన్యమును ఉండనేరదు. అదియునుగాక "పూర్వము ఎవరో ఏకారణము వల్లనో రాష్ట్రము అవసరమని యెంచి, ఒక సమయము చేసికొని, రాష్ట్ర మేర్పరచుకొని యుండవచ్చును. వారి నిర్ణయము వారినే బాధ్యులను చేయును కాని వారి సమయములును, నిర్ణయములును నాకు

వర్తింపవు. ఈ రాష్ట్రము నేను సమయము చేసికొని నిర్మించి నది కాదు" అను కారణమును చెప్పి యెవ్వరైనను విప్లవ మును బయలు దేరదీయవచ్చును.

పరిణామవాదము.

రాష్ట్రముయొక్క ఉత్పత్తి యెప్పుడు, ఏపరిస్థితులలో అయినదో నిర్ణయింపసాధ్యము కాదు, అది మానవసమాజము యొక్క క్రమపరిణామమువలన నేర్పడినది. మతము, యుద్ధ ములు, బాంధవ్యము రాష్ట్రనిర్మాణమునకు కొంత దోహద మొసగినవి. మానవుడు సాధారణముగ నే బాధలును లేని సుఖజీవితమును కాంక్షించును. అట్టి జీవితమును సాగించుటకు ఏవైనను ఇబ్బందులు కలిగినయెడల వానిని తొలగించుకొను టకు ప్రయత్నించును. ఇతరు లెవ్వరైనను వానిని తొలగించెడి యెడల అతడు అంతవరకును వారికి వశవర్తి యగును. రాజు లును, మతాధికారులును కొంతవరకును ఇట్టి యిబ్బందులను తొలగించి, జీవితము ప్రశాంతముగ సాగుట కవకాశములు కలిగించుచుండిరి. కాలక్రమమున సమాజము వృద్ధియై, కొన్నివర్గము లేర్పడి ప్రతివారికిని కొన్ని విధినిషేధము లేర్పడినవి. ఒక వర్గమువలన మరియొక వర్గమునకు బాధలు కలిగినవి. పాలకుడుగ నుండినవ్యక్తి నిరంకుశు డయ్యెను. బాధితవర్గములవారు సాముదాయకముగ బలము నుపయో

గించి తమ బాధలను తీర్చుకొనుచు వచ్చిరి. క్రమముగ వారిలో రాజకీయచైతన్య ముదయించి, తమస్థితిని బాగుపరచుకొనుట కధికారమును చేజిక్కించుకొనుట అవసరమని తోచినది. సాముదాయక శక్తి నాధారము చేసికొని వారు పాలకులవద్దనుండి అధికారమును లాగుకొని, సర్వభేదములను నిర్మూలించి స్వేచ్ఛాసమానతలను స్థాపించుకొనిరి. ఇది నేటి రాష్ట్రముల స్థితి. ఇది పరిణామలబ్ధము అనునది యీ వాదమునందలి సారాంశము.



# నాల్గవ ప్రకరణము

## రాష్ట్ర లక్ష్యము

రాష్ట్రమునకు ఎట్టి లక్ష్య ముండవలెను? రాష్ట్రము ఏయేపనులను చేయవచ్చును? పౌరులు ప్రభుత్వమునకు ఏల వశంవదులై యుండవలెను? వారు ప్రభుత్వము ఏమిచేసినను ఊరకుండవలసిన దేనా? అనునవి ఈ శాస్త్రమునందు చర్చింపదగిన ప్రశ్నలు.

ఈ ప్రశ్నలకన్నిటికిని సమయవాదము అనేకసమాధానములను సూచించును. ప్రాచీనగ్రీసులో ఎరిస్టాటిల్ (Aristotle) అను తాత్వికుడు ఒకవిధమగు సమాధానమును ప్రతిపాదించెను. మానవుడు ఒంటరిగ జీవింపలేడనియు, సాంఘికజీవితము అతనికి అవసరమనియు, కేవలమును జీవితము సాగునట్లు చేయుటయేగాక తన చట్టములమూలమునను సంస్థలమూలమునను పౌరుల గుణశీలములు పెంపొందునట్లు చేయుటకూడ ప్రభుత్వముయొక్క కర్తవ్యమనియు, వారి మానసిక హార్దికవికాసమును కలిగించుటయే రాష్ట్రముయొక్క పరమలక్ష్యమనియు అతని వాదము. లాక్ అను ఆంగ్లతాత్వికుడు శాంతిభద్రతలను, ఆస్తిపాస్తుల స్థైర్యమును సమకూర్చుట రాష్ట్రలక్ష్యమని ప్రతిపాదించినాడు. ఏడం స్మిత్ (Adam Smith) అనునతడు సమాజమునందు పరస్పర వైషమ్యములు లేకుండగ జేసి, లోకోపయోగకరములును

వ్యక్తులకు సాధ్యముకానివియునగు కట్టడములను నిర్మించుట ప్రభుత్వలక్ష్యములని చెప్పినాడు.

వాస్తవికవాదులు (Realists) లేనిపోని తాత్వికచర్చలలోనికి దిగక మానవుడు తనను, తన ఆస్తిపాస్తులను, కుటుంబమును స్వయముగ కాపాడుకొనజాలకయే రాష్ట్రమున చేరెను గనుక వానిని రక్షించుటయే ప్రభుత్వలక్ష్యము అనియందురు. వ్యక్తులు వారివారి స్వార్థములనే చూచుకొందురు గాని సాముదాయక క్షేమమునందు వ్యక్తి క్షేమము చేరియుండునని గ్రహింపరు గనుక దీనినే ప్రభుత్వము దృష్టియందుంచుకొనవలెనని ఆదర్శవాదుల (Idealists) వాదము. ఉపయోగవాదమని (Utilitarianism) మరియొకవాదము కలదు. ప్రతివ్యక్తియు "నాకుదుఃఖము అక్కరలేదు, సుఖమే కావలెను" అని కోరుచు వీలగునంత సుఖమును పొందుటకు ప్రయత్నించుచుండును. మానవసంఘములును ఇట్లే కోరుచుండును. ఇట్టి మానవులును, సంఘములును చేరి రాష్ట్రమేర్పడును. అందువలన రాష్ట్రముయొక్క పరమలక్ష్యము అత్యధికసంఖ్యాకులకు అత్యధికసుఖమును కూర్చుట అయియుండవలెను అని యీ వాదమునందలి సారాంశము. వైయక్తికవాదమని (Individualism) మరియొకవాద మున్నది. మానవులకు సహజముగ కొన్ని హక్కులు ఉండును. వీనిలో చాలవాటిని నిలుపుకొనగలుగుటకై వారు కొన్నిటిని వదలుకొని రాష్ట్రమును స్థాపించిరి. అందువలన పౌరులు తమయందే నిలుపుకొనిన హక్కులను రక్షించి, వానికి భంగము

కలుగకుండగ చూచుటయే రాష్ట్రలక్ష్యమని ఈ వాదమునం దలి సారాంశము.

పౌరులు ప్రభుత్వముయొక్క శాసనములను ఏల శిర సావహింపవలెను? అను ప్రశ్న ఇచ్చట బయలువెడలును. దానికి అనేక సమాధానములను చెప్పవచ్చును. ప్రభుత్వము తాత్కాలికముగ రాష్ట్రముయొక్క అధికారమునంతటిని వహించి, బలము నుపయోగించి, తన శాసనములను అమలు పరచును. వ్యక్తుల కట్టి శక్తి యుండజాలదు. అందువలన వారు ప్రభుత్వమునకు వశంవదులై యుండవలెను అనునది ఒక సమాధానము. పౌరులు కొన్ని హక్కులను వదలుకొని మిగిలినవానిని అనుభవింపగలుగుటకే రాష్ట్రము నేర్పరచు కొనిరి. వారు విడచిపెట్టిన హక్కులను రాష్ట్రముపక్షమున ప్రభుత్వము చలాయించును. ప్రభుత్వము లేనియెడల రాష్ట్ర ముండజాలదు. రాష్ట్రమే లేనియెడల వ్యక్తులు తమకు ఉంచు కొనిన హక్కులకే భంగము కలుగును. అందువలన తమ హక్కుల స్వాస్థ్యముకొరకై వారు ప్రభుత్వమునకు లోబడి యుండవలెననునది ఒక సమాధానము. ఎవరికి నిలచియున్న హక్కులను వారు అమలుపరచుకొను అధికారము ప్రతివా రికిని కలదు. కాని సామాన్యముగ వ్యక్తులు స్వార్థపరులుగ నుండుటవలన ఒకరి ప్రవృత్తి మరియొకరికి నష్టకష్టములను కలిగింపవచ్చును, లేదా సాముదాయకముగ సమాజక్షేమ మునకు భంగకరము కావచ్చును. ఇట్టి కష్టనష్టములు కలుగ కుండునట్లు చేయుటకు ఒక మధ్యవర్తి కావలెను. ప్రభుత్వము

ఈ మధ్యవర్తి. అందువలన సాముదాయక క్షేమమును సమకూర్చు ప్రభుత్వ శాసనములను ఎల్లరును శిరసావహింపవలెను అనునది ఇంకొక సమాధానము. వ్యక్తుల కాలమునందు చాలభాగము వారివారి సంసారములను సాగించుకొనుటయందే గడచిపోవును. దూరమాలోచించి తమ మంచిచెడ్డలను నిర్ణయించుకొనుటకు తగిన సావకాశము వారికి లభింపదు. రాష్ట్రమునకు ఏవిధమగు పక్షపాతమును ఉండదు. వ్యక్తుల శ్రేయమునే అది కాంక్షించును. వ్యక్తులకు సాధ్యముకాని దూరాలోచనను చేసి, వారి ప్రస్తుతసుఖమునకును, భావి అభివృద్ధికిని అనుగుణ్యములగు శాసనములనే రాష్ట్రప్రభుత్వము అమలుపరచును. ఆ కారణమువలన ప్రభుత్వము యొక్క శాసనములను పాలించుటయే వ్యక్తులకు క్షేమకరము అనునది మరియొక సమాధానము. ప్రజాసత్తాకములలో రాష్ట్రము ప్రజలది. రాష్ట్రప్రభుత్వము ప్రజలు ఏర్పరచినది. అది అమలుపరచు శాసనములు ప్రజాప్రతినిధులు నిర్మించు శాసనములు. అందువలన శాసనములకు వశులై వర్తించుటలో ప్రజలు తమకు తామే వశులైయుందురని అర్థమేర్పడును. ఇది యింకొక సమాధానము. ఎవరి యిష్టమువచ్చినవిధమున వారు వర్తించినయెడల నెవరి క్షేమమును సుస్థిరము కాజాలదు. అందువలన వచ్చెడి కష్టనష్టములకు ఎవరినికూడ బాధ్యులను చేయుట వీలుపడదు. ప్రభుత్వపు శాసనములను పాలించుటవలన ఒకవేళ నష్టమే కలిగినను అది పరిమితముగనే ఉండును. దానికైనను ప్రభుత్వము

బాధ్యత వహించును. శాసనములను పాలింపకుండుటవలన కలుగు నష్టముకంటెను పాలించుటవలన కలుగు నష్టము తక్కువగనుక వానిని పాలించుటయే లాభకరము అనునది మరియొక కారణము. పౌరులు తమ శాసనములను మన్నింపనియెడల ఏ ప్రభుత్వమును నిలువజాలదు. ప్రభుత్వమును ఏర్పరచువారు ప్రజలే గనుక ఒకవేళ ప్రభుత్వము నిరంకుశమైనయెడల వారు దానిని మార్పవచ్చును. ఉన్నంతకాలమును దాని శాసనములను పాలించుట వారి విధి. ఎట్లు చూచినను శాసనములకు వశులై యుండుటలో వ్యక్తులకు హాని లేదు అని స్పష్టమగుచున్నది.

ఎట్టి పరిస్థితు లేర్పడినను, ప్రభుత్వముయొక్క శాసనములు ఎట్టివి అయినను పౌరులు వానిని శిరసావహింపవలసినదేనా? దుష్టప్రభుత్వమును, దుష్టశాసనములను ప్రజలు సహించి యూరకొనవలసినదేనా? లేక అట్టిప్రభుత్వమును, శాసనములను వారు ప్రతిఘటింపవచ్చునా? అను ప్రశ్న కూడ ఈ సందర్భమున బయలుదేరును. దీనికిని వెనుక చర్చించిన సమయవాదము నాధారము చేసికొని సమాధానము చెప్పవచ్చును. ఐరోపాలో మధ్యయుగమునందు ఏ రాజైనను మతవిషయములలో జోక్యము కలిగించుకొనినయెడల ప్రజలు అతని శాసనములను తిరస్కరింపవచ్చునని కొందరు తాత్వి

కులు ప్రచారము చేసిరి. ప్రాచీన భారతీయ తాత్త్వికులును రాజు ధర్మమునకు విరుద్ధముగ ప్రవర్తించినయెడల ప్రజలతని పదచ్యుతుని చేయవచ్చునని చెప్పియుండిరి. సమయవాదము ననుసరించి ప్రజలు తమహక్కులలో కొన్నిటిని విడచి పెట్టిరి. వానిని రాష్ట్రము గైకొని ప్రభుత్వముద్వారా చలాయించును. ప్రభుత్వము ఆ హక్కులను అతిక్రమించి శాసనములను ప్రవర్తింపచేసినయెడల ప్రజలు వానిని తిరస్కరింపవచ్చునని యేర్పడును. అట్లే వారు కొన్నిహక్కులను తమయందే ఉంచుకొనిరి. ప్రభుత్వము ఈ హక్కులకు భంగకరముగ ప్రవర్తించినను ప్రజలు దానిని ప్రతిఘటింపవచ్చుననియు నేర్పడును. పౌరులకు ప్రధానముగ కావలసినవి శాంతి భద్రతలు. అవి లేనియెడల వారు రాష్ట్రమునందుండి ప్రయోజనము లేదు. ప్రభుత్వము వాటిని నెలకొల్పి, రక్షింపలేనియెడల పౌరులు ఆ ప్రభుత్వపు ఆజ్ఞలను మన్నింపవలసిన బాధ్యత లేదని స్పష్టమగుచున్నది. రాష్ట్రమునందు స్వామ్యము ప్రజలదే గనుకను, ప్రభుత్వము ప్రజలు ఏర్పరచినదే యగుటవలనను, దాని పరిపాలనవలన గలుగు కష్టనష్టములను అనుభవించువారు తామే యగుటవలనను ప్రజలకు ప్రభుత్వమును దాని చర్యలను, శాసనములను విమర్శించుటకు అధికారము కలదు. ఇట్టి విమర్శాపూర్వకమగు అభిప్రాయమును వెలిబుచ్చుటకును, దానిని ప్రచారము చేసి అధికసంఖ్యాకుల ఆమోదమును సంపాదించుటకును ప్రతి

పౌరునికిని అధికారము కలదు. అదేవిధమున ఎన్నికలద్వారా శాంతియుతముగను, విప్లవముమూలమున బలవంతముగను అక్రమముగ ప్రవర్తించు ప్రభుత్వమును నిర్మూలించి మరి యొక మంచిప్రభుత్వమును స్థాపించుటకును ప్రజలకు హక్కు కలదు.



మధ్యయుగమునందు కొన్ని మార్పులు వచ్చినవి. ఐరోపాలో క్రైస్తవమతము విజృంభింప సాగినది. ఫ్యూడలిజం ( Feudalism ) అను భూస్వామిత్వవిధానము వ్యాప్తిలోనికి వచ్చెను. మతసంస్థకును, రాష్ట్రమునకును తీవ్రమగు సంఘర్షణ జరిగి తుదకు మతసంస్థ స్వతంత్ర మయ్యెను. పౌరులు రాష్ట్రమునకువలెనే, ఈ సంస్థకును లోబడియుండవలసి వచ్చుటవలన రాష్ట్రము జోక్యముకల్పించుకొనదగిన యంశములు పరిమితము లైనవి. ఫ్యూడలువిధానము ఆచారములకును, సంప్రదాయములకును ప్రాధాన్యము నిచ్చెను. రాష్ట్రము వీనికి విరుద్ధముగ నేశాసనమును ప్రవర్తింపజేయుటకుగాని, వ్యక్తుల ప్రవృత్తిని నియమించుటకుగాని శక్తివంతము గాకుండెను.

౧౮ వ శతాబ్దిలో పారిశ్రామికవిప్లవము బ్రహ్మాండములగు మార్పులను తెచ్చెను. పరిశ్రమలన్నిటియందును యంత్రము లుపయోగింపబడి, వస్తువులు విరివిగ తయారగుచుండినవి. ఈ యాంత్రికపరిశ్రమలకు పెద్దపెద్ద పెట్టుబడులు కావలసి వచ్చెను. విశేషమగు లాభమును పొందు నవకాశముండుటవలన అనేకులు పెద్దమొత్తములను పెట్టుబడి పెట్టుచుండిరి. యంత్రాగారములలో పని చేయుటకై కార్మికవర్గ మేర్పడెను. పెట్టుబడిదారులు లాభములనే ఆశించి, కార్మికులను పీడించుచుండిరి. ఈ విషయమై ఆందోళన బయలుదేరినది. అప్పుడు కొందరు తాత్త్వికులు ప్రభుత్వ మీ విషయమున జోక్యము కలిగించుకొనకూడదనియు, కొంతకాలము

నకు ఎవరికి యోగ్యమైన స్థితిని వారు తమంతట తామే పొందుదురనియు, "ఎవరికి వారే" (Lessez Fare) సిద్ధాంతము నొకదానిని ప్రతిపాదించిరి. ఈ సిద్ధాంతమును రాజకీయములకును లగించి, రాష్ట్రము పౌరులను ఎవరి కర్మమునకు వారిని వదలివేయవలెననియు, అప్పుడే యెవరికి అనువైన అభివృద్ధిని వారు పొందుదురనియు ప్రతిపాదించిరి. ఇందు మూలమున కొద్దిమంది ధనికులు బాగుపడినను, కార్మికులు విశేషములగు బాధలకును, కష్టనష్టములకును లోనైరి. తుదకు ప్రభుత్వములు వీరిపక్షమున జోక్యము కలిగించుకొని, పెట్టుబడిదారులను కొంతవరకును నిర్బంధింపవలసి వచ్చినది.

౧౯ వ శతాబ్దిలో పౌరులకును రాష్ట్రప్రభుత్వములకును ఉండవలసిన సంబంధములను గురించియు, రాష్ట్రము యొక్క జోక్యమునకు ఉండవలసిన మితినిగురించియు క్రొత్త సిద్ధాంతములు బయలుదేరినవి. వానిలో వైయక్తికవాదమును (Individualism) ఆదర్శకవాదమును (Idealism) సమాజవాదమును (Socialism) ముఖ్యములు.

## వైయక్తికవాదము.

రాష్ట్రమునందు వ్యక్తియే ముఖ్యుడు. వ్యక్తుల కొరకు రాష్ట్ర మేర్పడినది కాని రాష్ట్రముకొరకు వ్యక్తు లేర్పడలేదు. వ్యక్తులు రాష్ట్రము నేర్పరచిరి. వ్యక్తులు తమంతట తాము స్వార్థపరులై ఒకరికొకరు హాని కలిగించుకొందురు. ఈ హాని కలుగకుండగను, వారు ప్రశాంతముగ జీవింపగలు

గుటకునై, అనగా, తమలో సహజముగనుండు స్వార్థపరత్వమును దుర్గుణమును అరికట్టుటకై వారు రాష్ట్రము నేర్పరచుకొనిరి. అందువలన రాష్ట్రముయొక్క జోక్యము ఇంతవరకే, పరిమితమై యుండవలెను. దీనినిబట్టి అశాంతిని నిర్మూలించుట, అసౌకర్యములను, బాధలను తొలగించుట, శాంతిభద్రతలను రక్షించుట, పౌరులు పరస్పరము చేసికొను ఒడంబడికలు పాలింపబడునట్లు చేయుట రాష్ట్రముయొక్క ముఖ్యకర్తవ్యము లగును. అప్పుడు ప్రభుత్వము ఒక పోలీసువాని వంటిది అగును. దాని జోక్యము నీవిధమున పరిమిత మొనర్చుచు ఈవాదము వ్యక్తికి పరిపూర్ణమగు స్వేచ్ఛను ఉపపాదించును. మానవునియొక్క పరమావధి సర్వతోముఖమగు అభివృద్ధి. మానవుడు తనమీదనే ఆధారపడి యుండుటను, ఆత్మవిశ్వాసమును, తనకు తానే అన్ని విషయములయందును ప్రేరేపించుకొనగలుగుటను అలవరచుకొని తన శీలమును అభివృద్ధి పరచుకొనవలెను. ఇందుకు స్వేచ్ఛ అవసరము. అది లేనియెడల పౌరులు పరాశ్రయజీవు లగుదురు. ర్థికముగ ప్రతివ్యక్తియును తనకు లాభదాయకమని తోచిన పనిని చేసి అట్టి పనులకొరకే తన ధనమును పెట్టుబడి పెట్టును. తాను, ఏవృత్తికి అర్హుడో, తనకు ఏపని లాభదాయకమో అతడు ఇతరులతో పోటీవలన నిర్ణయించుకొనగలుగును, ప్రకృతిలో జీవజంతువులలో నిరంతరమును పోటీ జరుగుచుండును. ఈ పోటీలో స్వేచ్ఛ యున్నది. ఇందు నిలువగల బలమును, అర్హతయు గల జంతువులు నెగ్గి బయట

పడును. ఇది ప్రకృతిలోని ముఖ్యధర్మము. రాష్ట్రమునందలి ప్రజల మనుగడయు ఈధర్మమునే అనుసరించును. ఈ కారణములవలన వ్యక్తులకు వీలగునంత స్వేచ్ఛ అవసరము అనునది యీ వాదమునందలి సారాంశము.

ఈవాదము పైకి ఆకర్షకముగనే ఉండినను దీనిలో కొన్ని దోషము లున్నవి. ఈనాటి జీవితము బహుక్లిష్టమైనది. ఇతరులయొక్క, అందునను, ప్రభుత్వముయొక్క సహాయము లేక జీవితమును సాగించుకొనుట దుర్లభము. అట్లే ఎవరి బాగోగులను వారు నిర్ణయించుకొనుటయు దుస్సాధ్యము. స్వేచ్ఛ ఒక పరిమితిని నాటినయెడల బలవంతులు బాగుపడుటయు, బలహీనులు చెడిపోవుటయునుగ పరిణమించును. అందువలన అందరును కొంత స్వేచ్ఛను సమానముగ ననుభవింపవలెననినయెడల అందరును కొంత స్వేచ్ఛను వదలుకొని సమిష్టిగ కొన్ని నియమములకు లోబడవలసి యుండును.

## ఆదర్శక వాదము.

రాష్ట్రము వ్యక్తులసముదాయము. అందువలన వ్యక్తుల లక్ష్యమునకును, రాష్ట్రముయొక్క లక్ష్యమునకును వైరుధ్యముండజాలదు. ప్రత్యేకవ్యక్తులు స్వార్థపరులై, సంకుచితభావములను కలిగి యుండవచ్చును. సాముదాయకక్షేమమునకంటెను స్వంతక్షేమమునే వారు ముఖ్యముగ పరిగణింపవచ్చును. వాస్తవముగ సాముదాయకక్షేమమునందే వ్యక్తిక్షేమము ఇమిడియుండును. ప్రభుత్వము పాలించు శాసన

ములు దీనిని సాధించునవిగనే ఉండును. అందువలన ప్రభుత్వము కలిగించుకొను జోక్యము పౌరుల మంచికొరకే అగును. ఒక వ్యక్తి యేమతము నవలంబించినను, ఏమతమును కూడ అవలంబింపక పోయినను అందువలన నేర్పడు మంచి చెడ్డలు అతనివే యగును. అట్లే ఒక పౌరుడు తన కుటుంబమును తన యిష్టమువచ్చిన విధమున పాలింపుకొన వచ్చును. కాని ప్రయొక వ్యక్తియు తన సర్వతోముఖాభివృద్ధికి కావలసిన అన్ని సౌకర్యములను కల్పించుకొనజాలడు. ప్రతివారును ధనము వ్యయము చేసి చదువు నేర్చుకొన లేక పోవచ్చును. విద్య నేర్వని మానవుని బుద్ధి వికసింప నేరదు. అట్టియెడ ప్రభుత్వము జోక్యము కలిగించుకొని ఉచితముగ విద్య నేర్పుట కేర్పాటు చేసి, దాని నేర్చునట్లు వ్యక్తులను నిర్బంధింప వచ్చును. అట్లే కలరా, మశూచి మొదలగు తీవ్రరోగములు రాకుండగ జాగ్రతపడుట ప్రతివారికిని తెలియక పోవచ్చును. వీలు కాక పోవచ్చును. అట్టియెడ ప్రభుత్వము అందరికి టీకాలు వేయింప వచ్చును. ఈవిధమున వ్యక్తియొక్క లక్ష్యమును, ప్రభుత్వము యొక్క లక్ష్యమును ఒకటియే అయినప్పుడు సాము దాయక క్షేమముకొరకు ప్రభుత్వము ఎంత జోక్యము కలిగించుకొనినను తప్పు లేదు.

## సమాజవాదము.

రాష్ట్రము ఒక లక్ష్యమును సాధించుట కేర్పడినది కాని కేవలమును ఇబ్బందులను, అడ్డంకులను తొలగించుట

కొరకే కాదు. యావత్తు సమాజముయొక్క క్షేమమును దాని లక్ష్యము కాని కొందరు వ్యక్తులయొక్క అభివృద్ధియే కాదు. ఏ కొద్దిమందియో బాగుపడి, బహుసంఖ్యాకులు బాధపడుచుండునెడ సామాజిక స్థైర్యము నశించును. ప్రభుత్వము అట్టియెడ ఉదాసీనముగ నుండరాదు. నేటి ఆర్థిక జీవితము బహు క్లిష్టమైనది. వస్తువుల నిర్మాణమును, వాని పంపకమును మిక్కిలి ముఖ్యమైన అంశములు. అవి వ్యక్తుల అధీనమునందుండునెడల వారు తన్మూలమున స్వార్థము నభివృద్ధి పరచుకొనెదరు. అందువలన సమాజము బాగుపడదు సరికదా, అందలి అత్యధికసంఖ్యాకులు బాధపడుదురు. ఈ కారణము వలన ప్రభుత్వమే ఒక ప్రణాళిక నేర్పరచి, దాని ననుసరించి ముఖ్య పరిశ్రమలను తానే నిర్వహింపవలెను. అప్పుడు వానివలన వచ్చు లాభము ఏ కొందరు వ్యక్తులకో చెందక సమాజము యొక్క ప్రతినిధియగు ప్రభుత్వమునకే చెందును. ఆలాభమును ప్రభుత్వము సమాజమంతటికిని, అనగా పౌరులందరికిని ఉపకరించు పనులను చేయుటకు వ్యయపరుప వచ్చును.

## సర్వతావాదము.

౨౦ వ శతాబ్దమునందు టోటలిటేరియనిజం (Totalitarianism) అను పేరుతో ఈ వాదము బయలుదేరినది. దీనియందు రాష్ట్రము అవిచ్ఛిన్నముగ సాగునది. వ్యక్తులు వచ్చుచు పోవుచు నుందురు. శాశ్వతముగనుండు రాష్ట్రము

నకు, ఒక లక్ష్య ముండును. దానిని సాధించుటయే ప్రభు త్వము చేయు పని. మధ్యలో వచ్చి మధ్యలో పోవు వ్యక్తు లకు ఈలక్ష్య మేదియో తెలియదు. వారి జీవితములు ఈ లక్ష్యసాధనకు అనుకూలములుగ నుండవలెను. అందువలన ప్రభుత్వము వైయక్తికజీవితములను పూర్తిగ, అన్ని విషయ ములయందును నియమింపవచ్చును, నియోగింపవచ్చును. పౌరులు రాష్ట్రలక్ష్యమును చేరుటకు సాధనములే కాని వారికి ప్రత్యేకవ్యక్తిత్వము లేదు. ఈవాదము రెండవ ప్రపం చయుద్ధమునకు ముందు బయలుదేరి ఇటలీ జర్మనీలలో వర్ధి ల్లినది.

ఏవాదము ఏవిధముగ నుండినను రెండు అంశములు మాత్రము నిర్వివాద్యములు. అందు ఒకటి వ్యక్తులు రాష్ట్ర మునందు అతిముఖ్యమైనభాగము అనునది. వ్యక్తి లేని రాష్ట్రము వరుడు లేని పెండ్లివంటిది. వ్యక్తులకు తెలియని దియు, వారి ఆశయములకు భిన్నమైనదియునగు రాష్ట్రలక్ష్య మొకటికలదనుట కుందేలుకు కొమ్ము కలదు అనుట వం టిది. అందువలన వ్యక్తులకొరకే, వ్యక్తుల అభివృద్ధికొరకే రాష్ట్ర ముద్దేశింపబడినది అనుట నిర్వివాద్యాంశము. రెండవ అంశము రాష్ట్రముయొక్క ప్రత్యక్షసహాయము విశేషముగ లేనిదే వ్యక్తులు అతిక్లిష్టమైన లౌకికజీవితమును సాగింపజా లరు అనునది. సాముదాయకముగ సమాజమంతటికిని సంబం ధింపక వ్యక్తులకుమాత్రమే సంబంధించు విషయములలో

వారికి పూర్తియగు స్వేచ్ఛ నొసగి, వారందరి పురోగతికిని అవసరములై, వారు సాధింప వీలుకాని విషయములలోను, ఏకొద్దిమందికో వదలినయెడల సమిష్టిగ నష్టము కలిగించు విషయములయందును మాత్రము రాష్ట్రప్రభుత్వము జోక్యము కలిగించుకొనవలెను.



# ఆరవ ప్రకరణము

---

## రాష్ట్రనిర్మాణము.

పూర్వము రాష్ట్రములు బహుచిన్నవిగ నుండెడివి. ఒక నగరమే ఒక రాష్ట్రముగ నేర్పడినను, లేక తక్కువ విస్తృతిగల ప్రదేశము ఒక రాష్ట్రముగ నేర్పడినను దాని పరిపాలనము మిక్కిలి సులభముగ నుండును. పౌరులు అన్యోన్యపరిచయము గలవారుగ నుందురు. పరిపాలనవిధానమును సులభముగ నుండును. అనేకమంది దానియందు పాల్గొనుటకు అవకాశ ముండును. కాలక్రమమున రాష్ట్రముల విస్తృతి పెరిగినది. దానితో వాని పరిపాలనవిధానము క్లిష్టమైనది. ప్రజలందరికిని బదులుగ వారి ప్రతినిధులు దానిని నిర్వహింపవలసి వచ్చినది. ప్రభుత్వముల బాధ్యత ఎక్కువ అయినది. ఈ విశాలరాష్ట్రముల పరిపాలనకై వ్యవస్థలు (Constitutions) ఏర్పడినవి.

ఏవిధమగు రాష్ట్రమైనను, ఏ దేశమైనను నేడు పరిపాలనవిధానములలో సామాన్యముగ మూడు ముఖ్యాంశములు కనిపించుచున్నవి. ఇవి శాసనకర్తృకము, కార్యకర్తృకము, న్యాయకర్తృకము అనునవి. వీనిలో దేశములనుబట్టి కొన్ని అవాంతరభేదము లున్నవి.

## శాసనకర్తృకము (Legislature).

రాష్ట్రముయొక్క లక్షణములలో స్వామ్యము ముఖ్యమైనదని యిదివరలో చెప్పియుంటిమి. ఈ స్వామ్యము శాసననిర్మాణముద్వారా వ్యక్తమగును. అందువలననే రాష్ట్రమునందలి స్వామ్యము శాసనకర్తృకములో ప్రతిష్ఠింపబడినదని ఒక సిద్ధాంతము రూఢి అయినది. రాజులు పరిపాలకులుగ నుండినంతకాలమును స్వామ్యము వారియందే ఉండుట వలన, పరిపాలనమునకు అవసరములైన శాసనములను వారే నిర్మించుచుండిరి. ఆరాజులు పోయి ప్రజలయందు స్వామ్యము ప్రతిష్ఠింపబడుటతో పరిపాలనమునుకూడ వారే నిర్వహింపవలసి వచ్చినది. రాష్ట్రమునందున్న ప్రజలందరును కలసి నేటి అతివిశాలరాష్ట్రముల పరిపాలనమును నిర్వహించుట అసంభవము. అందువలన ప్రజాప్రతినిధులద్వారా ఈ కార్యమును నిర్వహించుట ఆచారమైనది. ఈ ప్రతినిధులు ఒకచోట చేరి వ్యవహారమును సాగించు సంస్థకు శాసనకర్తృకమని పేరు. దీనిలోని ప్రతినిధులను ఏర్పరచుటకు రెండు పద్ధతులు కలవు. వీరిని ప్రభుత్వము నియోగింపవచ్చును. రెండవపద్ధతి వీరిని ప్రజలు ఎన్నుకొనుట. ఈ ఎన్నికలపద్ధతియే సర్వసర్వత్ర వ్యాప్తియందున్నది. అప్పుడే ప్రజాస్వామ్యరాష్ట్ర మనగా "ప్రజలచేత, ప్రజలకొరకు, పరిపాలింపబడు ప్రజలయొక్క రాష్ట్రము" అను నిర్వచనము సార్థకమగును.

ఈనాడు రాష్ట్రములలో శాసనకర్తృకములు రెండు శాఖలుగ నున్నవి. ఒకశాఖలో కేవలమును ప్రజాప్రతినిధు లుందురు. వారు దేశము మొత్తముమీాద ఇంతమందిప్రజలకు ఒక సభ్యుడు అను నిర్ణయముప్రకారము ప్రజలచేత ఎన్నుకొనబడుదురు. వీనిని ప్రజాసమితులని పేర్కొనవచ్చును. ఇవి కొన్నియేండ్లకు ఒకసారి రద్దు అయి, క్రొత్త యెన్నికలు జరిగి క్రొత్త సభ్యులు వచ్చుచుందురు. రెండవ శాఖను శాసనసభ అని పేర్కొనవచ్చును. దీని సభ్యత్వము బహువిధములుగ నుండును. ఇంగ్లండులో దీనికి ప్రభువుల సభ (House of Lords) అని పేరు. దీనిలోని సభ్యులు పారంపర్యముగవచ్చు భూస్వాములు. ఫెడరలువిధానమును అనుసరించు అమెరికాసంయుక్తరాష్ట్రములవంటి దేశములలో ఈ సభ్యులు ఫెడరేషనులో చేరిన రాష్ట్రముల ప్రాదేశికప్రతినిధులుగ నుందురు. కొన్ని దేశములలో విద్య, ధనము, మేధ, సంఘసేవానుభవమువంటి ప్రత్యేకయోగ్యతలుకలవారు కొందరు ఈసభకు నియోగింపబడుదురు. సామాన్యముగ ఈసభ రద్దు కాక శాశ్వతముగ నుండును కాని దీనిలోని సభ్యులు కొందరుకొందరు నియమితకాలమున విరమించి, క్రొత్తవారు వచ్చుచుందురు.

శాసనకర్తృకమునందు రెండుశాఖ లుండవలెనా లేదా అను సంశయమునుగురించి కొంతకాలము వాదోపవాదములు జరిగినవి. ప్రజాస్వామ్యభావము ప్రబలుటతో పారంపర్యముగ అధికారమును చలాయించుటయెడలను, జన్మకా

రణముగ గౌరవములను అనుభవించుట యెడలను వైము ఖ్యము ఏర్పడి ప్రజల ఎన్నికయు, అర్హతయునే ఏ గౌరవాధి కారములకైనను కారణములు కావలెనను భావ మేర్పడినది. ప్రజాప్రతినిధులుమాత్రమే ఉండునదికాక మరియొక శాఖ కూడ ఉండవలెనని చెప్పువారు ఈ కారణములను సూచింతురు. (౧) ఒకే శాఖ ఉండినయెడల అది నిరంకుశము కాగలదు. రెండవశాఖ దానిని అరికట్టును. (౨) ప్రజాప్రతినిధులుగ వచ్చువారిలో ఉద్రేకమును, తొందరపాటును, అనుభవరాహిత్యతయు ఉండును. శాసననిర్మాణమునకు కావలసిన మేధ, నిదానము, లోకానుభవము మున్నగువానిని ఈ రెండవశాఖలో కలిల్పవచ్చును. (3) పరిపాలనమునకును దేశాభివృద్ధికిని ఉపకరింపగలుగువారు ఎన్నికలలో పాల్గొని, నెగ్గి రాలేకపోవచ్చును. అట్టివారిని ఉపయోగించుకొనుటకు రెండవ శాఖ అవకాశమును కల్పించును. (౪) విశ్వవిద్యాలయములు, వర్తకసంఘములు, స్త్రీలు మున్నగువారికి ప్రాతినిధ్యము నొసగుటకు ఈశాఖ ఉపకరించును.

శాసనకర్తృకమునందు ప్రతిశాఖకును అందలి కార్యకలాపమును సక్రమముగ నడిపించుటకై ఒక అధ్యక్షు డుండును. ద్రవ్యమునకు సంబంధించిన విషయములనుమాత్రము ప్రజాప్రతినిధిసమితి మొదట ప్రేరేపించును. తక్కిన అన్నివిషయములకు సంబంధించిన శాసనములును ఏశాఖలోనైనను ఉపపాదింపబడవచ్చును. ప్రతి ప్రతిపాదనను ఒక శాఖ తర్వాత రెండవది ఆమోదించినగాని అది పరిపాలనాధిపతి

ఆమోదమును పొందజాలదు. సవరణలనుగురించి అభిప్రాయ భేదము వచ్చినప్పుడు రెండు శాఖలయొక్కయు సంయుక్త సమావేశమునందు చర్చింపబడి అవి సరిచేయబడును. ప్రతి శాఖకును ఒక ప్రవీణులసంఘ ముండును. ఆ సంఘము సభ్యులు ఉపపాదించు ప్రతిపాదనలకు యథాశాస్త్రీయములగు భాషారూపములను కలిగించును. ఇదిగాక ఈసంస్థ ప్రభుత్వముయొక్క చర్యను విమర్శించును. సభ్యులు ప్రభుత్వము చేసిన పనులనుగురించియు, చేయబోవు పనులనుగురించియు ప్రశ్నలు వేసి తమ అభిప్రాయములను వెలిబుచ్చెదరు. దేశమునం దేదైనను ముఖ్యసంఘటన జరిగినయెడల దానిని చర్చింతురు. ఈవిధమున ఈసంస్థ పరిపాలనమును పర్యవేక్షించును. దీని అంగీకారమును బడయలేకపోయినను, తీవ్రమగు విమర్శకు గురియైనను, ప్రతికూలమగు ఓటుకు గురియైనను అప్పటికి అధికారమునందున్న పాలకవర్గసభ్యులు తమ పదవులకు రాజీనామాల నిచ్చి, వైదొలగుదురు. రాష్ట్రప్రభుత్వమును నిర్వహించువారు ఈ సంస్థకు బాధ్యులై ప్రభుత్వమును నిర్వహింతురు.

## కార్యకర్తృకము (Executive).

రాష్ట్రముయొక్క పరిపాలనాధికారము ఈ కార్యకర్తృకమునందు స్థాపింపబడును. దీని ప్రధానకర్తవ్యము శాసనకర్తృకము నిర్మించిన శాసనములను అమలు జరపుచు పరిపాలనను సాగించుట. ఇందులకై అనేకమంది ఉద్యోగులు

గల సిబ్బంది ఉండును. వీరందరునుగల పరిపాలనయంత్రి మును కార్యకర్తృకము నడిపించును. ఈశాఖ పరిపాలనావ సరమునుబట్టి నిబంధనలను ప్రివర్తింపజేయును. శాసనకర్తృ కమును సమావేశపరచుట, పొడిగించుట, రద్దుపరచుట, ఆ శాఖ సమావేశమై యుండనప్పుడు అవసరమగునెడల శాసన ములను నిర్మించుట, రాష్ట్రమునందలి ఉద్యోగులను నియో గించుట తొలగించుట, సైన్యమును అదుపులో నుంచుట, దేశము వెలుపలనుండి వచ్చు ఉపద్రవములను ఎదుర్కొనుట, దేశములోపలి అశాంతిని అణచివేయుట, ఇతరదేశములతో వ్యవహారములను జరపుట మున్నగునవి ఈశాఖ విధులు.

ఈ కార్యకర్తృకమునందు సంఖ్యనుబట్టియు, లక్షణ ములనుబట్టియు భేదము లున్నవి. ఒక్కొకరాష్ట్రమునందు అధికారము ఒక వ్యక్తియం దుండవచ్చును. అట్లయినయెడల పనులు తొందరతొందరగ జరిగి, నాయకత్వమునందు ఐక్యత ఉండి, జవాబుదారీ ఎక్కువగ నుండును. కాని ఈవ్యక్తి సరి యైన దృక్పథము కలిగియుండనియెడల నిరంకుశుడు కావ చ్చును. కొన్నిరాష్ట్రములలో కార్యకర్తృకాధికారము కొం దరు వ్యక్తులుగల సంఘమునం దుండును. ఇట్లుండుటవలన నిర్ణయములయందు నిదానమును, అనుభవమును కనిపిం చును కాని పనులు తొందరగ కావు. బాధ్యతయు కొంత లోపించును. లక్షణమునుబట్టి పార్లమెంటరీవిధానమనియు, అధ్యక్షవిధానమనియు కార్యకర్తృకమునందు రెండు విధ

ములు కలవు. పార్లమెంటరీవిధానమునందు పరిపాలనమును నిర్వహించు మంత్రులు శాసనకర్తృకములోని సభ్యులలో నుండి నియమింపబడుదురు. అందలి బహుసంఖ్యాకుల ఆమోదమును పొందగలిగినంతవరకును అధికారమునం దుందురు. ఈ పద్ధతివలన ప్రజాప్రతినిధులకు ప్రభుత్వమువీఁద పలుకుబడి ఎక్కువగ నుండి వారు ప్రభుత్వమునందలి బాగోగులను సన్నిహితముగ తెలిసికొనుట కవకాశము లెక్కువగ నుండును. కాని యీ మంత్రులు పరిపాలన విషయము లంతగ తెలియకపోవుటవలన ఉద్యోగులమీఁదనే ఆధారపడి యుండవలసి వచ్చును. అధికారమునం దున్నంతకాలమును వీరికి దాని నెట్లు నిలుపుకొనుట, బహుసంఖ్యాకుల ఆమోదము నెట్లు నిలుపుకొనుట అనునాత్రత యుండును. అధ్యక్షవిధానమునందు అట్లు కాదు. అధ్యక్షు డేర్పరచు మంత్రులు అక్షరశః అతని మంత్రులే. దక్షులగువారినే అతడు మంత్రులుగ నియమించుకొనవచ్చును. అందువలన పరిపాలనము బాగుగ సాగును.

## న్యాయకర్తృకము.

రాష్ట్రస్థైర్యము న్యాయముయొక్క స్థైర్యముమీఁద నాధారపడి యుండును. పౌరుల శాంతిభద్రతలు దీనిపైన నాధారపడి యుండును. ప్రభుత్వమును పౌరులునుకూడ క్రమతమ ధర్మముల నతిక్రమింపకుండునటుల చూచి సందిగ్ధాంశములనుగురించి నిష్పాక్షికమగు తీర్పు చెప్పుట ఈశాఖ.

యొక్క ధర్మము. ఫెడరలు విధానముల ననుసరించు రాష్ట్రములలో రాష్ట్రవ్యవస్థను వ్యాఖ్యానమును, సమన్వయమును చేయునధికార మాశాఖకుం దుండును. ఈ శాఖలోని న్యాయమూర్తులు కార్యకర్తృకముచే నియోగింపబడవచ్చును లేదా శాసనకర్తృకముచే ఎన్నుకొనబడవచ్చును లేదా ప్రజలచే ఎన్నుకొనబడవచ్చును. వీరికి రాజకీయపక్షములతో నేవిధమగు సంబంధమును ఉండకూడదు. వీరి ఉద్యోగకాలపరిమితియు, వేతనములును నిర్బాధకములుగ నుండవలెను.



# ఏడవ ప్రకరణము

## రాష్ట్రభేదములు

నేటిప్రపంచమునందు ఎన్నియో రాష్ట్రము లున్నవి. అవియన్నియు ఒకేవిధముగ లేవు. వానియందు అనేక భేదము లున్నవి. ఒకరాష్ట్రమే ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క విధముగ నుండును. దాని పూర్వస్థితికిని, అనంతరస్థితికిని చాల భేదము కనిపించును. ఈ భేదము లెట్లేర్పడును, వానిని గుర్తించుట ఎట్లు అనునంశము లీప్రకరణమున చర్చింపబడును.

రాజకీయతాత్త్వికులు రాష్ట్రములలో భేదములను గుర్తించుటకు కొన్ని సూత్రములను ప్రతిపాదించిరి. ఈ సూత్రములనుబట్టి రాష్ట్రముల ప్రభుత్వములయందును భేదములేర్పడును. రాష్ట్రముల పౌరులస్థితిగతులయందును వ్యత్యాసములు కనిపించును. ఇట్టిసూత్రములలో స్వామ్యము, ప్రభుత్వలక్ష్యము, శాసననిర్మాణాధికారము ముఖ్యము లైనవి.

స్వామ్యము ఒకేవ్యక్తియందు ప్రతిష్ఠితమై యుండిన యెడల అది ఏకపాలక లేక రాజపాలితరాష్ట్రము (Monarchy) అగును. అట్లుకాక స్వామ్యము కొద్దిమందిలో ప్రతిష్ఠితమై యుండినయెడల ఆ రాష్ట్రము కులపాలిత (Arsitocracy) మగును. స్వామ్యము బహుసంఖ్యాకులయందు ప్రతిష్ఠితమగు

నెడల రాష్ట్రము ప్రజాస్వామ్యరాష్ట్ర (Democracy) మగును. వీనిలో ప్రభుత్వలక్ష్యమునుబట్టి మరియొకభేద మేర్పడును. రాష్ట్రపాలకుడగు వ్యక్తి సాముదాయకాభివృద్ధిని లక్ష్యము నందుంచుకొని పరిపాలన సాగించినయెడల మంచిదియే. అత డట్లుగాక తన స్వార్థమునే గమనించుచుండినయెడల ఆరాష్ట్రము నిరంకుశపాలిత (Tyranny) మగును. అల్పసంఖ్యాకులచే పరిపాలింపబడు రాష్ట్రములలో పాలకులగువారు ప్రభుకుటుంబములలో పుట్టుటవలనగాని, ధనికులగుటవలనగాని, బలిమిచేగాని అధికారమును వశపరచుకొని యుండవచ్చును. వారు ప్రజలందరి యోగక్షేమమును పురస్కరించుకొని పరిపాలించిన మంచిదే. కాని కొన్నిసమయములలో వారు స్వార్థపరులు కావచ్చును. అప్పుడు రాష్ట్రముయొక్కతీరు మారును. అట్లే ప్రజాస్వామ్యములలో పరిపాలనము శాసనబద్ధముగను, సక్రమముగను సాగినంతవరకును మంచిదే. కాని యీ లక్షణములు లోపించినయెడల రాష్ట్రము అనామకమగును. అదేవిధమున ఏకపాలితములలో ఒక్కడే శాసనములను నిర్మించి, అమలుపరచును. ప్రజాస్వామ్యరాష్ట్రములలో ప్రజలందరునుగాని, ప్రజలు ఎన్నుకొనిన ప్రతినిధులుగాని శాసనములను నిర్మింతురు.

ఇటీవల రాష్ట్రభేదములను సూచించు అంశములు మరికొన్ని బయలువెడలినవి. పైన పేర్కొనినవి పూర్వరాష్ట్రములను వర్తించినవి. ఇటీవలయేర్పడిన లక్షణములలో రాష్ట్రప్రవృత్తియొక్క హద్దుఒకటి. కొన్నిరాష్ట్రములలో ప్రభు

త్వము బహుకొద్దివిషయములలో జోక్యము కలిగించుకొని, పౌరులకు వీలగునంత స్వేచ్ఛ నిచ్చును. మరికొన్నిటిలో పౌర జీవితమునందలి అనేకాంశములు ప్రభుత్వముచే నియమింపబడును. ప్రభుత్వమేర్పరచు విధినిషేధముల సంఖ్య ఎక్కువగనుండి పౌరులస్వాతంత్ర్యము మిక్కిలి తక్కువగనుండును. ఇట్టివి నియంతృత్వరాష్ట్రము (Dictatorship) లగును.

కొన్ని రాష్ట్రములు ఏకరాష్ట్రములుగ (Unitary States) నుండును. వీనిలో నొక కేంద్రప్రభుత్వముండి, రాష్ట్రమునంతటిని ప్రత్యక్షముగ పరిపాలించును. మరికొన్ని సమాఖ్యారాష్ట్రములు (Union States) సర్వస్వతంత్రములగు కొన్నిరాష్ట్రములు, తమలో అన్నింటికిని వర్తించు కొన్నియంశముల సత్పరిపాలనముకొరకు ఒక సమాఖ్యగనేర్పడి, ఒక కేంద్రప్రభుత్వము నేర్పరచుకొని, దానికి పరిమితములగు పై యధికారములనుమాత్రము వప్పగించి, మిగిలిన పరిపాలనమును తమకుతామే నిర్వహించుకొనుచుండును. ఈవిధముగ నైక్యతను, వైవిధ్యమును సమన్వయించువిధానమునకు ఫెడరలిజం (Federalism) అనిపేరు.



# ఎనిమిదవ ప్రకరణము

## సమత

మానవసమాజమునందు ప్రతివారును కోరునదియు, ప్రభుత్వములు తమపౌరులలో నెలకొల్పుటకు ప్రయత్నించునదియు, ప్రపంచమునందలి రాష్ట్రముల వ్యవస్థలలో సామాన్యముగ నుద్ఘాటింపబడునదియు సమత (Equality). మానవులందరును సమానులే అను సిద్ధాంతము రాజకీయవాదోపవాదములలో ముఖ్యస్థానము వహించినది. ఈ సిద్ధాంతము కొంతవివరముగ ఈ ప్రకరణమునందు చర్చింపబడును.

మానవులందరికిని కొన్ని సామాన్యలక్షణము లున్నవి. జననమరణములు, సుఖదుఃఖములు, హర్షామర్షములు, క్రోధమాత్సర్యములు, అహంకారమమకారములు ఇవి అన్నియు అందరికిని సమానములే కాని ఈ కొద్ది సామాన్యలక్షణములతోబాటు మానవులలో పరస్పరము అనేక వ్యత్యాసములు కనిపించుచున్నవి. బలములో, మేధలో, నైతికసంపదలో, గుణశీలములలో, పొట్టిపొడుగులలో, శరీరచ్ఛాయలో, సుఖదుఃఖానుభవములో ఇంకను అనేక ఇతరవిషయములలో మానవునికిని మానవునికిని తేడాలు కలవు. ఇట్టి వైరుధ్యములో సమత యెట్లు పొసగును అనునది సముంజసమైన సందేహమే.

కొంచెము సూక్ష్మముగ నాలోచించినయెడల కేవలమును ప్రకృతి యేర్పరచిన భౌతికవ్యత్యాసములు అటున్నను

మనస్సునకును, హృదయమునకును సంబంధించిన అనేకాంశములలో మానవులందరును సమానులే. ఇతరజంతువులతో పోల్చినయెడల మానవునియందు స్ఫుటముగ కనిపించునది హేతుశక్తి. మంచిచెడ్డలను గ్రహింపగలుగుట, ఏదియెట్టిదో తెలిసికొనగలుగుట అను వివేకము అందరికిని సమానముగ కలదు. అట్లే ప్రతిమానవునకును సమాజమునందు జీవింపవలెనను కోరిక ప్రబలముగ నుండును. ప్రతివానికిని తాను ఇతరులను బాధించనియెడల సామాన్యముగ తనకు ఇతరుల వలన కీడు కలుగదు అను నింగితజ్ఞాన ముండును. సమాజమునందు జీవించుచుండునంతకాలమును ప్రతివ్యక్తియు కొన్ని సామాజికనియమములకు లోబడి యుండవలెను. మానవులలోగల హేతుశక్తిని, వివేకమును, ఇంగితజ్ఞానమును ఆధారము చేసికొని ప్రభుత్వములు పౌరులలో ఖ్యాతికేతరముగు అన్నివిషయములయందును సమతను కల్పించుటకు ప్రయత్నించును. కాని ఏహక్కులనైనను, ఏ సదుపాయములైనను అందరును సమానముగ ఒకే రీతిని, ఒకే మేరకు అనుభవించునట్లు ఎవరును చేయజాలరు. అట్టి సమత ప్రకృతికే విరుద్ధమైనది. అందరు వ్యక్తులయొక్కయు, సమాజమంతటియొక్కయు యోగక్షేమములను నిష్పాక్షికముగ నిర్వహించుటకొరకు ఏర్పడిన రాష్ట్రప్రభుత్వములు ఎల్లరకును సమానములగు నవకాశములనుమాత్రము కల్పింపగలవు. రాష్ట్రములు రాజుల యేలుబడియం దుండినంతకాలమును వానిలో జన్మవర్ణవర్గభేదము లామోదింపబడినంతకాలమును ఇట్టి

సమానావకాశము లుండుటకు వీలు లేకపోయినది. కాని ప్రజాస్వామ్యసిద్ధాంతము ప్రబలి, రాష్ట్రములు ప్రజాసత్తాక ములగుటతో ఈవిధమగు సమత అనివార్య మైనది. ఇది లేని యెడల ప్రజాస్వామ్యసిద్ధాంతమే కుంటుపడును.

పైన పేర్కొనబడిన అవకాశసామ్యత ఈక్రింది విషయములలో గాంచనగును. (౧) చట్టములు:— రాష్ట్రమునందు అమలులోనుండు చట్టము లందరియెడలను సమానముగ వర్తించును. అవి యే వ్యక్తికిగాని, వ్యక్తులసంఘమునకు గాని అనుకూలముగను, ప్రతికూలముగను ఉండవు. ఏ నేరమును చేయని వ్యక్తికిని, అది ఉదహరించు విధినిషేధములకు లోనైయుండు వ్యక్తికిని వానివలన నెట్టిభయము నుండదు. అట్లే చట్టములు ఈయగల రక్షణ అందరికిని సమానముగ లభించును. (౨) రాజకీయములు :— ప్రజాసత్తాకమనగా ప్రజలచేత, ప్రజలకొరకు సాగింపబడు ప్రజలప్రభుత్వము అని సుప్రసిద్ధమగు నిర్వచనము కలదు. దీనినిబట్టి ఇట్టిరాష్ట్రములలో ప్రతివ్యక్తికిని పరిపాలనవిషయమై ఇతరులతో సమానముగ కొన్ని హక్కు లుండును. ప్రతివారును పరిపాలనవిషయమై వీలగునంత శ్రద్ధ వహింపవచ్చును. ప్రతివారికిని శాసనకర్తృకమునకు సభ్యులను ఎన్నుకొనుటకును తానే సభ్యుడుగ ఎన్నుకొనబడుటకును హక్కు ఉండును. తమ ఓటును స్వేచ్ఛగ ఉపయోగించుటకు అందరికిని సమానమగు స్వేచ్ఛ యుండును. అదేవిధమున ఆయాపదవులకు తగిన యోగ్యతను సంపాదించినవారందరికిని ప్రభుత్వోద్యో

గములను నిర్వహించు అధికార ముండును. (౩) సాంస్కృతికము:— ప్రతిమానవుడును తన సర్వతోముఖాభివృద్ధిని కాంక్షించును. అందుకు విద్య, సంస్కృతి అవసరములు. విద్య నేర్చు అధికారము అందరికిని సమానముగనే ఉండును. (౪) ఆర్థికము:— జీవితము సాగుటకు ప్రతివారికిని ఏదైనను ఒక ఉద్యోగమో లేక వృత్తియో అవసరము. వీటిని ఎవరికి తోచిన విధమున వా రవలంబింపవచ్చును. అందుకు అనువైన సమానావకాశములను ప్రభుత్వము కల్పించును.

సమతకును స్వేచ్ఛకును సన్నిహితమగు సంబంధము కలదు. ఒక వ్యక్తికి ఏపని చేయుటకైనను పూర్తియగు స్వేచ్ఛ యుండినయెడల నతడు ఇతరులకు ఇబ్బంది కలుగు విధమున ధనధాన్యాదులను సేకరించి నిలవ చేయును. అప్పుడు అందరికిని సమానావకాశములు లభించుట అసంభవ మగును. అట్లే ప్రతివారికిని స్వేచ్ఛ యుండి ప్రతివారును తమతమ శక్తి ననుసరించి ప్రయత్నింపనియెడల సమానావకాశ ముపయోగపడజాలదు. ఒకరికి గల యవకాశమును సమానముగ ననుభవించు హక్కును మరియొకరు గౌరవించి ప్రవర్తించినయెడల ఆ యవకాశము నందరును సమానముగ ననుభవింపగలుగుదురు.

ఇట్లు సమత అను సిద్ధాంతమునకు వాస్తవప్రపంచమునందు సమానావకాశత అని అర్థ మేర్పడును.

# త్రొమ్మిదవ ప్రకరణము

## స్వేచ్ఛ

ఏ రాష్ట్రమునందైనను పౌరుల స్వేచ్ఛ ప్రధానమైనది. ప్రాకృతస్థితియందు ప్రజలు పూర్తియగు స్వేచ్ఛ ననుభవించుటకు వీలు కాకుండుటవలననే రాష్ట్ర మేర్పడినది. వ్యక్తులు కొంత స్వేచ్ఛను విడనాడినను మిగిలినదానిని నిరాటంకముగ అనుభవింపగలుగుట న్యాయము; అవసరము. పౌరులకు వీలగునంత స్వేచ్ఛ నిచ్చి దానిని కాపాడుట ప్రభుత్వముయొక్క ముఖ్యధర్మము.

ఈస్వేచ్ఛ యెట్టిది? స్వేచ్ఛ అనగా ఏవ్యక్తి ఎప్పుడు ఏపని చేయవలెనని తోచిన అప్పుడు దానిని చేయగలుగుట అని అర్థము. ఈ అర్థ మూహాలో నుండదగిన దేకాని వాస్తవముగ సిద్ధించునది కాదు. ఇట్టి స్వేచ్ఛను ఏవ్యక్తియు అనుభవింపజాలడు. ఒకవేళ ఇందు చాలభాగమును ఏ ఒకడైనను అనుభవించినను అది ఇతరుల స్వేచ్ఛకు భంగకరమగును. అందువలన స్వేచ్ఛయనుపదమునకు ఇతరులకు బాధ కలిగింపని పద్ధతి నెవరికి తోచినవిధమున వారు ప్రవర్తింపగలుగుట అని వాస్తవార్థ మేర్పడును. ఇట్టి స్వేచ్ఛ నిరాటంకముగ నుండవలెను. అనగా, ప్రభుత్వముగాని ఇతరవ్యక్తులుగాని, వ్యక్తులసంఘములుగాని దీని కేవిధమగు నభ్యం

తరములను కలిపింపకూడదు. అప్పుడు ప్రతివ్యక్తియు సర్వతోముఖముగ నభివృద్ధి నందగలుగును.

ఈస్వేచ్ఛలో పౌరత లేక పౌరధర్మము ఇమిడి యున్నది. ప్రతిపౌరుడును తాను రాష్ట్రమునం దుండు నంత కాలమును కొన్ని హక్కులను కలిగియుండును. ఈహక్కులు చట్టబద్ధములై యుండును. వానిని ప్రభుత్వము తన బలము నుపయోగించి వ్యక్తులకు అమలుపరచును. వానిలో నీక్రిందివి ముఖ్యములు :—

(౧) జీవించుటకు హక్కు.

ప్రాకృతస్థితియందు ఎవరి ప్రాణములకును ప్రమాద రాహిత్యత లేకుండెడిది. ఎవరికివారు సర్వస్వతంత్రులై, సాముదాయక క్షేమమును, వ్యక్తి క్షేమమును కాపాడు నధికారము లేనందుననే వ్యక్తులందరును కలిసి రాష్ట్రము నేర్పరచుకొనిరి. అందువలన నేప్రమాదమును లేకుండగ, ప్రాణహాని కలుగకుండగ జీవింపగలుగు హక్కు అన్నిటికంటెను ముఖ్యమైనది, అందువలననే న్యాయశాస్త్రమునందు హత్య మొదటి శ్రేణికి చెందిన నేరముగ పరిగణింపబడుచున్నది.

(౨) శారీరక క్షేమము.

ప్రతివ్యక్తియు తనకు తోచిన స్థలమునకు పోగలిగి యుండవలెను. ఎప్పుడును, ఎచ్చటను, ఎవరివలనను అతని శరీరమునకు బాధ కలగకూడదు. బలహీనుడగు వాడు బలవంతునివలన భౌతికముగ హానిని పొందరాదు.

(౩) ఆస్తి విషయమైన హక్కు.

మానవులందరును తమకు ప్రకృతమునగాని, భావికాలమునగాని ఉపయోగపడు వస్తువులను సేకరించి, దాచుకొందురు. ఈ సేకరణ ప్రకృతిసిద్ధము. కొందరు తమతమ అభిరుచులనుబట్టి కొన్నికొన్ని ప్రత్యేకవస్తువులను, పుస్తకములను, కళాత్మకములగు వస్తువులను సంపాదించి జాగ్రత పెట్టుకుందురు. అందరును ధనధాన్యములను నిలవ చేసికొందురు, ఇండ్లను, భూములను సంపాదింతురు. ఇవియన్నియు వైయక్తికమగు ఆస్తిగ లెక్కకు వచ్చును. ఏవిధమగు నష్టమును కలుగకుండగ నీయాస్తిని నిలవబెట్టుకొని, అనుభవింపగలుగుటకు ప్రతివారికిని హక్కు ఉండవలెను.

(౪) పరువుమర్యాదలకు సంబంధించిన హక్కు.

ప్రాణమునకును, శరీరమునకును, ఆస్తిపాస్తులకును పిమ్మట ప్రతివ్యక్తికిని తన పరువుమర్యాదలు మిక్కిలి విలువైనవి. సమాజమునందు అతనికి గల స్థానమును, గౌరవమును, పలుకుబడియు వానిమీదనే ఆధారపడి యుండును. అదియునుగాక అపకీర్తియు, అపనిందయు ప్రతివారికిని మానసికముగ బాధను కలిగించును. ఒక్కొకప్పుడు అవి కొన్నికొన్ని వృత్తులలో నుండువారి వృత్తులకే భంగము కలిగించును. ప్రతివానికిని తాను అనర్హముగ అపనిందపాలు కాకుండుటకు హక్కు కలదు. ఇతరులకు పరువునష్టము కలిగించుట నేరముగ పరిగణింపబడును.

(౫) మతవిషయకమగు హక్కు.

అనేక దేశములలో చిరకాలము ప్రభుత్వము ఏదో ఒక మతమును అభిమానించెడిది. దానిని అనుసరించువారి కే హక్కులును, సౌకర్యములును ఉండెడివి. మతాంతరుల కనేక విధములగు నిబ్బందులు సామాజికముగను, రాజకీయము గను ఉండెడివి. ఇటీవల నీ అసౌకర్యము తొలగినది. మతము కేవలమును వైయక్తికమగు విషయము. ఎవరికి నచ్చిన మత మును వారు అవలంబింపవచ్చును. ఎవరును ఏయొకమత మును అవలంబించునట్లు నిర్బంధింపబడరాదు. ఒకవేళ నొక వ్యక్తి ఏమతమును అనుసరింపకపోయినను అతడు ఏనిర్బంధ మునకును లోబడకూడదు.

(౬) ప్రకటనవిషయకమగు హక్కు.

ఎవరిమటుకు వారు అన్నియంశములను గురించియు తమ బుద్ధికి తోచిన అభిప్రాయములను కలిగి యుండవచ్చును. ఇతరులకు బాధను, నష్టమును కలిగింపకుండునంతవరకును, రాష్ట్రక్షేమమునకు హాని కలిగింపకుండునంతవరకును ప్రతి వ్యక్తికిని తన యభిప్రాయములను ముఖతఃగాని, లిఖితముగ గాని ప్రకటించుటకు హక్కు ఉండవలెను. ప్రజాసత్తాకము లలో లోకాభిప్రాయము మిక్కిలి ముఖ్యమైనది. అవి బహు సంఖ్యాకుల అభిప్రాయము ననుసరించియే. నడచును. అందు వలన సాంఘికార్థిక రాజకీయమతసాంస్కృతికాది విషయము లలో ప్రతివారికిని ప్రకటన స్వేచ్ఛ ఉండవలెను.

(౭) సమావేశములకు సంబంధించు హక్కు.

మానవుడు సామాన్యముగ నొంటరిగ జీవింపలేడు. అతడు సామాజికజీవితమును కాంక్షించును. సమాజము నందు అనేకాంశములనుగుర్తించి ఒకేవిధములగు అభిప్రాయములు కలవా రనేకులుందురు. ఇట్టివారు తమ అభిమాన విషయములను తరచు చర్చింపగోరుదురు. ఇందుకు సమావేశము లవసరము లగును. అట్లే తమకు మంచివని తోచిన విశ్వాసములను ఇతరులకు తెలియచేయవలెనను కుతూహల మనేకుల కుండును. ఈ కారణమువలన సంఘముల నేర్పరచుకొని, సమావేశములను జరపుకొని ప్రచారము చేయు హక్కు ప్రతివారికిని ఉండవలెను.

(౮) కుటుంబవిషయకములగు హక్కులు.

ఇది కేవలమును వైయక్తికమైనది. ప్రతివ్యక్తియు తన కుటుంబజీవితమును తన యిష్టమువచ్చినట్లు నిర్వహించుకొనగోరును. వివాహము చేసికొనుట లేక మానుట, భార్యను బిడ్డలను తాను కోరినరీతిని అదుపులో నుంచుకొనుట, తనకు నచ్చిన ఉద్యోగమునో, వృత్తినో అవలంబించుట, తన ఆస్తిపాస్తులను తాను కోరినవిధమున పాలించుకొనుట మున్నగునవి ఇట్టి హక్కులు.

స్వేచ్ఛయనగా స్వాతంత్ర్యము. చట్టములు విధినిషేధాత్మకములు. అప్పుడు చట్టములమూలమున స్వేచ్ఛకు భంగము కలుగునుగదా, ఈ రెండును పరస్పరవిరుద్ధములు

కావా? అను ప్రశ్న యిచ్చట బయలుదేరును. చట్టములు అసలు ఉండకూడదనియు, ఒకవేళ ఉండినయెడల వీలగునంత తక్కువగ నుండవలెననియు ఒక వాదము. అట్లు కాదు, ప్రతి చట్టమును స్వేచ్ఛను స్థిరీకరించును, అందువలన చట్టములకును స్వేచ్ఛకును వైరుధ్యము లేదు అని మరియొక వాదము. చట్టములు స్వేచ్ఛను విపులీకరించి దాని యనుభవమునకు అనువగు వాతావరణము నేర్పరచును అనునది మిక్కిలి సమంజసమగు వాదము. ప్రతివానికిని తన యిష్టమువచ్చిన చోటుకు నడిచి పోవు హక్కు కలదు. తన యిష్టమువచ్చిన దానిని తినుటకు హక్కు కలదు. ఈ హక్కులను చలాయించుకొనుచు నొక వ్యక్తి అరటిపండ్లను తినుచు వాని పైతోలును రోడ్డుమీద పారవేసి పోయెను అనుకొనుడు. ఆ మార్గముననే మరియొకవ్యక్తి ఏదియో తొందరపనిమీద పోవుచుండును. అతడు దారిలో అరటిపండుతోలును త్రొక్కి క్రిందపడి కాలుచేతులను విరుగగొట్టుకొనును. మరియొకడు తన స్వేచ్ఛను చలాయించుకొనుచు దారికి ఇటునటుగల చెట్లను నరికి వానిని మార్గమున కడ్డుగ పారవేసి పోవును అనుకొనుడు. అప్పుడు అతని వెనుక వచ్చువారికి దారి లభింపదుకదా! ఆవ్యక్తియే ఇంకొకసారి ఆమార్గమున వచ్చిన యెడల అతనికిని దారి దొరకదుకదా! తమయింటిలోని చెత్తను ఊడ్చి అవతల పారవేసి తమయింటిని శుభ్రముగ నుంచుకొను హక్కు అందరికిని కలదు. ఈ చెత్తను ఒకవ్యక్తి తనయింటిలోనుండి ప్రక్కయింటిలోనికి పారబోసెనని యను

కొనుడు. అది మరియొకరిమీద పడి నష్టము కలిగింపవచ్చును. వారి యింట పైనుండివచ్చిన చెత్త చేరును. అట్లే మరియొకరు చేసినను ఈవ్యక్తికి కష్టనష్టములు కలుగును. ఈ సందర్భములలో ఒకరి స్వేచ్ఛ మరియొకరికిని, సమాజమంతటికిని కూడ నష్టదాయక మగును. ఇట్టి స్వేచ్ఛను అరికట్టుట అవసరము. చట్టములు ఈపనిని చేయును. వానిమూలమున అందరి స్వేచ్ఛయు నిర్బాధక మగునుగదా! ఎవరికి కావలసిన వస్తువులను వారు సంపాదించుటకు హక్కు కలదు. ఇంకొకరు ఆవస్తువులను కాంక్షించి మొదటివ్యక్తి యింటిలో చొరబడి బలిమిచేత వానిని తీసికొనిపోయె ననుకొనుడు. అప్పుడు ఆవలి వ్యక్తి హక్కుకు భంగము కలిగినదికదా! చట్టములు ఇట్టిపనిని నిషేధించును.

ఈ కారణములనుబట్టి చట్టములు ఉండిననే వ్యక్తుల హక్కులు సురక్షితములుగ నుండుననియు, చట్టములకును హక్కులకును వైరుధ్యము లేదనియు స్పష్టమగును.



# పదియవ ప్రకరణము

## స్వామ్యము

రాష్ట్రమున నుండవలసిన ముఖ్యలక్షణములలో స్వామ్యము ఒకటి అని ఇదివరలో చెప్పియుంటిమి. ఈ స్వామ్యముయొక్క స్వరూపస్వభావముల నిర్వచనమునుగురించి వాదోపవాదములు జరిగినవి.

స్వామ్యమునకు, రాష్ట్రము వెలుపలనుండు నెవరి చెప్పుచేతలకును లోనుగాకుండుట, రాష్ట్రములోపల నేమిచేయుటకైనను పరిపూర్ణస్వాతంత్ర్యమును కలిగియుండుట అను రెండు ముఖ్యలక్షణములు కలవు. ఎట్టి శాసనమునైనను సృష్టించి, స్వయముగ దానికి లోబడక పౌరులపైన బలమునుపయోగించి దానిని అమలుపరచుట అని ఒక నిర్వచనము. ఐరోపాలో మధ్యయుగమునందు ఈ స్వామ్యమును అనేకులు అనేకవిధముల నిర్వచించి కొందరు ఇవి రాజులకు కలదనియు, కొందరు ప్రజలకు కలదనియు వాదించిరి. ౧౯ వ శతాబ్దిలో ఆస్టిన్ అనునతడు దీనికి చక్కని నిర్వచనము చేసినాడు. అతని మతమున "నిర్దేశించి చూపుటకు వీలయి, స్వయముగ నితరులకు వశమైయుండుటకు అలవాటుపడని ఏ వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని సంఘమునందలి బహుసంఖ్యాకులు వశులై యుండుటకు అలవాటుపడి యుండినయెడల ఆ సంఘమునందు ఆవ్యక్తి లేక వ్యక్తులు స్వామియై ఆసం

ఘము స్వతంత్రమైన రాష్ట్రముగ పరిగణింపబడును. ప్రతి శాసనమును ఆస్వామి సంఘమునందలి ఇతరసభ్యుల కిచ్చు ఆజ్ఞ."

స్వామ్యమునకు ఇది మిక్కిలి ప్రసిద్ధమైన నిర్వచనము. దీనిమూలమున ప్రతిసంఘమునందును ఒక స్వామి యుండవలెను, ఆస్వామి స్పష్టముగ నిర్దేశింపబడి యుండవలెను, పౌరుల హక్కులు స్వామియొక్క అనుగ్రహముమీద నాధారపడి యుండును అను సూత్రము లేర్పడును.

స్వామ్యము నిరంకుశము, అవిభాజ్యము అనుట సందేహాస్పదమైన అంశము. ఈస్వామ్యమును అమలు జరుపు వ్యక్తి రాష్ట్రముయొక్క లక్ష్యముల కనుగుణ్యముగ ప్రవర్తించిననే అతని శాసనము అమలు జరుగును. మానవసంఘము మంచివి అని యంగీకరించిన సూత్రములకు విరుద్ధముగు స్వామ్యము సాగజాలదు. కొన్నికొన్ని సఘములలో సుప్రతిష్ఠితములగు ఆచారములును, కట్టుబాట్లును ఉండును. స్వామియొక్క శాసనములు వానికి విరుద్ధములుగ నుండలేవు. ప్రజాస్వామ్య రాష్ట్రములలో శాస్త్రీయముగ శాసనకర్తృకములయందు స్వామ్యము ప్రతిష్ఠితమై యుండినను, ఆ శాసనకర్తృకములు వోటరులగు పౌరులమీద నాధారపడి యుండును. అదియును గాక పౌరులలో అనేకసమాజము లుండును. పౌరులు అనేక సమాజములలో సభ్యులై, వాని నిబంధనలకు బద్ధులై యుందురు. ఈ సమాజము లనేక రాష్ట్రములలోనికి వ్యాపించి యుండును. ఈవిధమున శాంతిభద్రతలకు భంగము కలిగింప

కుండునంతవరకే పౌరులు తమతమ రాష్ట్రముల స్వాములకు వశులై యుందురు గాని యితర విషయములలో కాదు. ఇట్లు స్వామ్యము రాష్ట్రముతో పాటు అనేక ఇతర సమాజముల మధ్య విభక్తమై యుండును. అంతర్జాతీయత, అంతర్జాతీయ సంస్థలు వృద్ధిపొందిన కొలదియు స్వామ్యము నిరంకుశమను వాదము నీరసించుచున్నది.

స్వామ్యము ఎవరియందున్నదియు నిర్ణయించుటకూడ క్లిష్టమగు సమస్యయే, ఎవరికి శాసనములను నిర్మించు నధికారము కలదో, యెవరి శాసనములు పౌరులందరి చేతను పాలింపబడునో వారు స్వామి అని స్థూలముగ నొక సమాధానమును చెప్పవచ్చును. ఏకరాష్ట్రములగు(Unitary States) ఇంగ్లండు వంటి దేశములకు ఇది వర్తించును కాని ఫెడరలు రాష్ట్రములకు వర్తింపదు. ఫెడరేషను అనునది కొన్ని ప్రత్యేకరాష్ట్రములు కొన్ని షరతులమీద కలియుట వలన నేర్పడును. ఫెడరలుప్రభుత్వమునకు ప్రత్యేకముగ కొన్నియు, దానిలోని రాష్ట్రముల ప్రభుత్వములకు ప్రత్యేకముగ కొన్నియు, ఉభయప్రభుత్వములకును ఉమ్మడిగ కొన్నియు హక్కులు ఆ ఫెడరేషనుయొక్క పరిపాలనప్రణాళికలో నిర్దేశింపబడి యుండును. అప్పుడు స్వామ్యము రెండుతావుల ప్రతిష్ఠింపబడినట్లగును. మొత్తము ఫెడరేషను కంతటికిని వర్తించు శాసనములను నిర్మించి, అమలుపరచు హక్కు ఫెడరల్ శాసనకర్తృకమున కుండును. కాని అది యేప్రణాళికననుసరించి యేర్పడునో ఆ ప్రణాళికను సవరణచేయు నధి

# పదునొకండవ ప్రకరణము

## కొన్ని దేశముల పరిపాలనప్రణాళికలు.

### ౧

### ఇంగ్లండు.

ఇంగ్లండు చరిత్రప్రసిద్ధమగు దేశము. ఆంగ్లేయుల రాజకీయానుభవములును, సంస్థలును విస్మయజనకము లైనవి. అవి నేటి అనేకరాష్ట్రముల పరిపాలనవిధానముల నిర్మాణనిర్వహణములకు మార్గదర్శకము లైనవి.

అయినను ఈ దేశమునకు లిఖితమైన పరిపాలనప్రణాళిక లేదు. ఆదిలో రాజులు నిరంకుశపాలకులుగ నుండిరి. క్రమక్రమముగ కొన్నికొన్ని సంస్థలు ఏర్పడి, క్రొత్తక్రొత్త సాంప్రదాయములు (Conventions) బయలు దేరినవి. ఈ సాంప్రదాయములు సాగుచువచ్చి శాసనములకంటెను శక్తివంతము లైనవి. తుదకు పరిపాలనయంత్రమంతయు ఈ సాంప్రదాయములమీద నాధారపడి నడవసాగినది.

ఇంగ్లండు ఏకరాష్ట్రము. ఈ రాష్ట్రమునందలి అధికారమంతయు ఏలికయందును, పార్లమెంటు అను శాసనకర్తృకమునందును ప్రతిష్ఠింపబడియున్నది. వాస్తవముగ పార్లమెంటులోని ఒకవిభాగమగు ప్రజాసభ (House of Commons) సర్వాధికారమును నిర్వహించును. ఈ దేశముయొక్క పరి

పాలనవిధానమునందు ఏలికయును, మంత్రిమండలియు, కార్య కర్తృకము, పార్లమెంటు శాసనకర్తృకము.

## ఏ లి క.

రాజ్యాధికారము పారంపర్యముగ జ్యేష్ఠపుత్రులకు సంక్రమించును. ఏలిక ప్రొటెస్టెంటుమతస్థుడుగ నుండవలెను. కేథలిక్కులను వివాహమాడరాదు. సింహాసనమునకు వచ్చిన వెంటనే ప్రతియేలికకును పార్లమెంటు స్వంతఖర్చుల నిమిత్తము కొంతద్రవ్యమును మంజూరు చేయును. రాష్ట్ర మునందలి పరిపాలనమంతయు, విదేశములతోను ఆశ్రిత దేశ ములతోను సంధులు, రాయబారములు, మున్నగు వ్యవహార ములును ఈ యేలిక పేరనే జరుగును. ఏలిక ఉన్నతోద్యో గులను నియమించును. పార్లమెంటును సమావేశపరచుట, పొడుగించుట, రద్దుచేయుట జరపును.

పూర్వము ఏలికలు సర్వస్వతంత్రులుగనుండి తమ యిష్టమువచ్చినవారిని మంత్రులుగ నియమించి పరిపాలనను సాగించుచుండిరి. ప్రజల పలుకుబడి హెచ్చి, ప్రజాస్వామ్య భావము ప్రబలి క్రమక్రమముగ పార్లమెంటులోని ప్రజాసభ లోగల ప్రజాప్రతినిధులనుండియే మంత్రులను నియమించుట ఆచారమైనది. ఏలికపేర జరుగు ప్రతిపనికిని మంత్రులు జవా బుదారీ వహింతురు. ఈనాడు ఏలిక చలాయించు అధికా రము బహుతక్కువ కాని సమర్థులగువారు మంత్రులకు మంచి సలహాల నీయవచ్చును. ఈనాటి ఆంగ్లదేశపు ఏలిక

పరిపాలనమంతటికిని శాస్త్రీయముగ అధిపతి; జాతీయతకు చిహ్నము.

మంత్రిమండలి.

ఆంగ్ల దేశముయొక్కయు, ఆశ్రిత దేశములయొక్కయు పరిపాలనమును వాస్తవముగ మంత్రిమండలియే (Cabinet) సాగించును. క్రొత్తగ పార్లమెంటు యెన్నికలు జరిగిన పిమ్మట, దానిలో నేరాజకీయపక్షపు సభ్యులు అధికసంఖ్యాకులుగ నుందురో ఆపక్షపు నాయకుని, ప్రధానమంత్రిగ నేర్పరచి, అతడు సూచించినవారి నితరమంత్రులుగ నియమించును. ఈ మంత్రిమండలి పార్లమెంటుకు జవాబుదారీ వహించి పరిపాలనను సాగించును. ప్రజాసభలోని అధికసంఖ్యాకులగు సభ్యులు అనుకూలముగ నుండునంతకాలమును ఈమండలి అధికారమునం దుండును. అధికసంఖ్యాకులు ప్రతికూలురైనవెంటనే మంత్రులందరును రాజీనామా నిచ్చెదరు. అప్పటికి అధికసంఖ్యాకుల ఆమోదము నందిన పక్షమునుండి మరియొక మంత్రిమండలి యేర్పడును. మంత్రిమండలి సాముదాయకముగను, మంత్రులు ప్రత్యేకముగను చేయు పనులన్నిటికిని మండలి యంతయు సమిష్టిగ జవాబుదారీ వహించును. ఒకవేళ దేశమునందలి ప్రజలు మంత్రిమండలి నీతికి అనుకూలముగనుండి, పార్లమెంటుమాత్రమే ప్రతికూలముగ నున్నటుల తోచినయెడల ప్రధానమంత్రి, యేలిక చేతపార్లమెంటును రద్దుచేయించి, తిరిగి యెన్నికలనుజరపించి,

క్రొత్త పార్లమెంటును సమావేశపరపింపవచ్చును. ఈ పార్లమెంటులోని పక్షముల బలమునుబట్టి మంత్రిమండలి స్థితిగతులు నిర్ణీతములగును.

## పార్లమెంటు.

ఇది రాష్ట్రమున ప్రధానమైన శాసనకర్తృకము. ఇందు ప్రభువులసభ అనియు, ప్రజాసభ అనియు రెండు శాఖలు కలవు. ప్రభువులసభలో ౭౨౦ మంది సభ్యులు కలరు. వీరిలో చాలమంది చిరకాలమునుండి పరంపరగ వచ్చుచుండిన భూస్వాములు. కొందరు మతసంస్థయందలి అధికారులు. కొంతమంది స్కాట్లండు ఐర్లండుల ప్రతినిధులు. మిగిలినవారు అప్పుడప్పుడు ఏలికచేత సృష్టింపబడినవారు. ఈసభలో స్త్రీలకును, విదేశీయులకును ప్రవేశము లేదు. ఈసభ అత్యున్నతన్యాయస్థానముగ కూడ వ్యవహరించును. ప్రభుత్వము యొక్క ఉన్నతోద్యోగులపైన తేబడు అభియోగము లిందు విచారింపబడును. ఆర్థికవిషయములుతప్ప తక్కిన విషయములకు వర్తించు ఏశాసనములనైనను ఈసభ ఉపపాదింపవచ్చును. ఇది ఆమోదించిన ప్రతిపాదనలు ప్రజాసభకు పంప డును. ప్రజాసభలో ఆమోదింపబడిన ప్రతిపాదనలు ఈ కు పంపబడును.

ప్రజాసభ పార్లమెంటులోని రెండవశాఖ. ఏవిషయ గురించియైనను శాసనములను నిర్మించు నధికారము ఈసభకు గలదు. ఆర్థికవిషయములకు సంబంధించిన ప్రతిపా

దనలన్నియు ముందుగ నిచటనే ఉపపాదింపబడవలెను. దీనిలో వయోజనులగు ప్రజలందరును ౨౦౦౦౦ మందికి ఒక్కరువంతున ఎన్నుకొనిన ప్రజాప్రతినిధులు ౬౪౦ మంది ఉందురు. సామాన్యముగ నీసభ ఐదుసంవత్సరములకాలము సాగును. మంత్రిమండలియొక్క పరిపాలనము నీసభ విమర్శించుచుండును. ప్రతికూలముగ ఓటుచేసి మంత్రిమండలినే మార్చివేయగలుగును. సామాన్యముగ ఈసభ చర్చించు ప్రతిపాదనలను మంత్రులే ప్రవేశపెట్టెదరు. ఇదిగాక సభ్యులును ఉచితములగు తీర్మానములను ప్రతిపాదింపవచ్చును. ఇందు కొన్ని సంఘము లుండును. అవి ప్రతిపాదనలను సవిమర్శముగ చర్చించి సభయెదుట పెట్టును. ఈ ప్రజాసభలోని కార్యక్రమమును నడిపించుటకు 'స్పీకర్' అను అధ్యక్షుడుండును.

ఉభయశాఖల ఆమోదమును పొందినమీదట ప్రతిపాదనలు ఏలికకు పంపబడును. అతడు ఆమోదించిన పిమ్మట నవి శాసనము లగును.

౨

# అమెరికా సంయుక్తరాష్ట్రములు

అమెరికాఖండము ఐరోపీయులకు ౧౫ వ శతాబ్దిలో తెలియవచ్చినది. ౧౭, ౧౮ శతాబ్దులలో రాజకీయమతవిప్లవములు కారణముగ ననేకులు ఐరోపాను వదలిపోయి, ఉత్తరఅమెరికాలో వలసలు ఏర్పరచుకొనిరి. అందు కొన్ని ఆంగ్లే

యుల వలస లుండెడివి. ౧౮ వ శతాబ్దిలో ఈ వలసలవారు ఇంగ్లండుతో యుద్ధము చేసి స్వాతంత్ర్యమును సంపాదించిరి. ఈ స్వాతంత్ర్యమును నిలుపుకొనుటకై ౧౩ వలసలవారు ఫెడరలు విధానము ననుసరించి ఒక సమిష్టిరాష్ట్రమును స్థాపించుకొనిరి. ప్రతిరాష్ట్రమును స్థానికవ్యవహారములను స్వతంత్రముగ నిర్వహించుకొనును. సాముదాయకయోగ క్షేమములకు సంబంధించిన వ్యవహారములనుమాత్రము ఫెడరలుప్రభుత్వము నిర్వహించును. తరువాత మరికొన్ని రాష్ట్రములీ ఫెడరేషనులో చేరినవి. నేడు ౪౮ రాష్ట్రములు అమెరికను ఫెడరలుసమాఖ్యలో చేరియున్నవి.

అమెరికాపరిపాలనవిధానము లిఖితమైన ప్రణాళికపైన ఆధారపడి యున్నది. దీనిలో రాష్ట్రములు వైయక్తికముగ నిర్వహింపగల అధికారముల పట్టిక ఒకటియు, ఫెడరలుప్రభుత్వముమాత్రమే నిర్వహింపగల అధికారముల పట్టిక ఒకటియు, ఉభయప్రభుత్వములును సమానముగ నిర్వహింపగల అధికారముల పట్టిక ఒకటియు ప్రణాళికయందు పేర్కొనబడినవి. వీనిననుసరించి ఉభయప్రభుత్వములును సాగును. ఫెడరలుప్రభుత్వమున కీయబడనివియు, రాష్ట్రప్రభుత్వములకు నిషేధింపబడనివియు అగు ఇతరాధికారములు రాష్ట్రములకు వదలబడినవి.

అమెరికాఫెడరలువిధానమున అధ్యక్షుడును, కాంగ్రెస్ అను శాసనకర్తృకమును, ఫెడరలుకోర్టు అను న్యాయకర్తృకమును ముఖ్యభాగములు.

## అధ్యక్షుడు.

రాష్ట్రమంతటికిని ఇతడు అధిపతి. సర్వకార్యములును ఇతని పేరనే జరుగును. అమెరికాలో జన్మించి, ౩౫ సంవత్సరముల వయస్సు గలిగి . అమెరికాలో ౧౪ సంవత్సరములు నివసించిన ఏవ్యక్తియైనను ఈ పదవికి రావచ్చును. ప్రతిరాష్ట్రమునందును కాంగ్రెసుసభ్యులు ఎంతమంది కలరో అంతమంది ఎన్నికదారులు ప్రత్యేకముగ ప్రజలచేత ఎన్నుకొనబడుదురు. ఈ యెన్నికదారులందరును చేరి అధ్యక్షుని ఎన్నుకొందురు. అట్లు ఏర్పరుపబడిన వ్యక్తి నాలుగుసంవత్సరములు ఆపదవియందుండును. తిరిగి అతడు ఆపదవికి ఎన్నుకొనబడవచ్చును. మహాప్రమాదకరములగు నేరములను చేసినయెడల కాంగ్రెసులోని ప్రజాసభ అధ్యక్షునిపై రాష్ట్రప్రతినిధులసభ యెదుట నేరారోపణచేసి పదచ్యుతుని చేయవచ్చును. అధ్యక్షుడు కాంగ్రెసుయొక్క అత్యవసర సమావేశముల నేర్పరచును. సందేశములద్వారా శాసనములు నిర్మింపబడవలసిన అంశములను నిర్దేశించును. కాంగ్రెసు నిర్మించు శాసనముల నామోదించును. అది సమావేశమైయుండని సమయములలో అవసరములగు శాసనములను చేసి ప్రకటించును. రాష్ట్రముయొక్క పరిపాలనమునకు అతడు బాధ్యత వహించును. అతనికిగాని, అతని మంత్రులకుగాని కాంగ్రెసులో స్థానము లేకుండుటవలన నీబాధ్యత మరింత యెక్కువగ నుండును. ఒక సెనెటుతో (రాష్ట్రప్రతినిధులసభతో) సంప్రతించి అతడు ఉన్నతోద్యోగులను నియమించును, ఇత

ర దేశములతో వ్యవహారములను సాగించును. ఇంగ్లండులో వలె నితనికి సలహానిచ్చుటకు నిర్దిష్టమైన మంత్రిమండలి లేదు. ఆయాశాఖల అధ్యక్షులే వాటికి సంబంధించిన విషయములనుగురించి సలహాల నిచ్చుచుందురు. అధ్యక్షుడు ఈ సలహాలను అంగీకరింపవచ్చును, నిరాకరింపవచ్చును. పరిపాలనమంతటిని స్వంతబాధ్యతపైన అతడు నిర్వహించును.

## కాంగ్రెసు.

ఇది రాష్ట్రమునందు ప్రధానమైన శాసనకర్తృకము. ఇందు సెనెట్ (Senate) అనియు, హౌవుస్ ఆఫ్ రిప్రెసెంటేటివ్స్ (House of Representatives) అనియు రెండు శాఖలు కలవు. మొదటిదానిలో రాష్ట్రమున కిద్దరువంతున ౯౬ మంది సభ్యు లుందురు. వారు ప్రజలచేత ఎన్నుకొనబడి ఆ రేండ్లు ఆపదవియందుందురు. రెండుసంవత్సరములకొకసారి వీరిలో ౧/3 వంతుమంది విరమింతురు. ఇంగ్లండులోని ప్రభువులసభవలెకాక నిది శక్తివంతమైన సంస్థ. ఆర్థికవిషయములు తప్ప మరియేవిషయమునుగురించియైనను ఇది శాసనములను నిర్మింపవచ్చును. ఇందలిసభ్యులలో ౨/3 వంతుమంది విదేశములతో జరుగు సంధులను ఆమోదింపవలెను. ఉన్నతోద్యోగులపై తేబడిన అభియోగముల నీసభ విచారించును.

ప్రజాప్రతినిధులసభ కాంగ్రెసుయొక్క రెండవ శాఖ. ఇందు ౪౩౫ మంది సభ్యులుందురు. వీరిని ప్రజలందరును ఎన్నుకొందురు. ఈసభలో ౧౫ స్థాయీసంఘము లున్నవి. ప్రతి

పాదనల నన్నిటిని ఈ సంఘములే చర్చించి సభయెదుట పెట్టును.

### పరమోన్నతన్యాయస్థానము

ఇది రాష్ట్రమున ప్రధానమగు న్యాయకర్తృకము. దీనికి రాష్ట్రములలో శాఖ లుండును. రాష్ట్రములలో అన్యోన్యమును, రాష్ట్రములకును ఫెడరలు ప్రభుత్వమునకును, ప్రధానోద్యోగులకు సంబధించియు, ప్రణాళికను గురించియు వచ్చు తగవులు దీనియందు పరిష్కరింపబడును. ఇందలి న్యాయమూర్తులను అధ్యక్షుడు నియమించును.

## 3
## భారతదేశము

ఈ దేశము ౧౯౪౭ సంవత్సరము ఆగస్టు ౧౫ వ తేదీ వరకును, సుమారు ఒకటిన్నరశతాబ్దులకాలము, బ్రిటిషువారి పరిపాలనమునందు ఉండెను. ౨౦ వ శతాబ్ది ప్రారంభము నుండియు దేశమున జాతీయోద్యమము ప్రబలినది. దానికి ఫలితముగ బ్రిటిషువారు అప్పుడప్పుడు రాజకీయసంస్కరణలను ప్రవేశపెట్టి దేశీయులకు కొంతకొంత స్వపరిపాలనాధికారము నిచ్చుచు వచ్చిరి. ౧౯౦౯, ౧౯౧౯, ౧౯౩౫ సంవత్సరములలో ఇట్టి చట్టములు అమలులోనికి వచ్చినవి. ౧౯౪౭ లో దేశమును భారతము, పాకిస్థాన్ అను రెండు రాష్ట్రములుగ విభజించి, భారతమును అధినివేశముగ (Dominio ) నేర్పరచి, దీని పరిపాలనాధికారమును తాత్కాలిక కేంద్ర ప్రభుత్వమునకు వప్పగించి బ్రిటిషువారు వైదొల

గిరి. ఈ సందర్భమున స్వతంత్రభారతమునకు ఉచితమగు పరిపాలన ప్రణాళికను తయారు చేయుటకై ఒక ఘటనపరిషత్తు ఏర్పరుపబడినది. ఈపరిషత్తు తయారుచేసిన ప్రణాళిక ౧౯౪౯ సంవత్సరము నవంబరు ౨౬ తేదీనాడు తాత్కాలిక భారత పార్లమెంటుచేత ఆమోదింపబడినది. దీనిననుసరించి ౧౯౫౦వ సంవత్సరము జనవరి ౨౬ వ తేదీనుండి భారత దేశము సర్వస్వతంత్రమగు ప్రజాసత్తాక రాష్ట్రమైనది.

నేటి భారత దేశపరిపాలన విధానమునందు ఈ క్రింది యంశములు గమనింపదగినవి :—

## రాష్ట్రస్వభావము.

భారతము పరమస్వామ్యసహిత ప్రజాసత్తాక ప్రజాతంత్రరాష్ట్రము. పౌరులందరికిని సాంఘికార్థిక రాజకీయన్యాయమును, ప్రకటనవిశ్వాస నిష్ఠారాధన స్వాతంత్ర్యమును, ప్రతిష్ఠావకాశములలో సమతను, వ్యక్తిగౌరవమును, జాతీయైక్యతను సంఘటించుట ఈరాష్ట్రముయొక్క లక్ష్యము.

## మూలధర్మములు.

పౌరులందరికిని జాతిమతవర్ణలింగ భేదములతో నిమిత్తము లేక సమానముగ వర్తించువిధమున కొన్ని హక్కులు ఈయబడినవి. అస్పృశ్యత నిషేధింపబడినది. ప్రభుత్వోద్యోగములలో నియోగింపబడుటకు అర్హతగలవారందరికిని సమానమగు హక్కు గలదు. పౌరులు తమ అభిప్రాయములను వాగ్రూపమునగాని, లిఖితరూపమునగాని స్వేచ్ఛగ

ప్రకటింపవచ్చును. సమావేశములను ప్రశాంతముగ జరపు కొనవచ్చును. దేశమునం దెచ్చటికైనను పోవచ్చును. ఎచ్చటనైనను స్థిరపడి ఆస్తిపాస్తులను సంపాదింపవచ్చును. ఎవరును ఒరులచేత నేవిధముగను బాధింపబడరాదు. ఎవరియిష్టమువచ్చిన మతమును వారు అనుసరింపవచ్చును; ప్రచారము చేయవచ్చును. అన్యమతము నవలంబించునట్లు ఎవరును నిర్బంధింపబడరాదు. పౌరులు తమతమ భాషలను, లిపులను, సంస్కృతిని రక్షించుకొనవచ్చును. తగినంతపరిహారము లేకయే ఎవరి ఆస్తియు లాగుకొనబడరాదు. ఈ మూలధర్మములకు భంగము వాటిల్లినయెడల పౌరులు వానిని పరమోన్నత న్యాయస్థానమున చర్చ జరపి సాగించుమనవచ్చును.

## రాష్ట్రనీతినిర్దేశకసూత్రములు.

రాష్ట్రముయొక్క లక్ష్యములను సాధించుటకొరకై ప్రభుత్వమునకు కొన్ని సూచనలు చేయబడినవి. సాంఘిక వ్యవస్థ ప్రజలకు యోగక్షేమకరముగను, న్యాయమైనదిగను ఉండునట్లు చేయుట; అస్వస్థత, వార్ధక్యము, నిరుద్యోగతవలన నెవరును కష్టముల పాలు కాకుండునట్లు చేయుట; వ్యవసాయమును, గృహపరిశ్రమలను వృద్ధిపరచుట; కార్మికులకు పనికి తగిన రాబడి, విరామము, అభివృద్ధికి అనువగు నవకాశములను కల్పించుట; ౧౪ సంవత్సరముల వయస్సువచ్చువరకును ప్రతిబిడ్డకును ఉచితనిర్బంధవిద్యను గరపుట మున్నగునవి ఈ సూచనలలో ముఖ్యములైనవి.

అధికారవిభజన.

భారతరాష్ట్రము కొన్ని ప్రాంతముల సమాఖ్య. సమాఖ్యకును అందు చేరియున్న ప్రాంతములకునుకూడ ప్రత్యేకప్రభుత్వము లుండును. ఇందు ఒక్కొకప్రభుత్వము నకు ప్రత్యేకముగ కొన్ని యధికారము లుండును. రెండుప్రభుత్వములకునుకూడ కొన్ని యధికారములు సమానముగ వర్తించు సంప్రతిపన్నాధికారము లుండును. ఈ యధికారములన్నియు మూడు పట్టీలలో పేర్కొనబడినవి. ఇట్లు పేర్కొనబడిన అంశములకు సంబంధించని విషయ మేదైనను వచ్చినయెడల దానిపై యధికారము సమాఖ్యాప్రభుత్వమునకు చెందును.

సమాఖ్యాపరిపాలనము.

ఈపరిపాలనము కార్యకర్తృకము, శాసనకర్తృకము, న్యాయకర్తృకము అను మూడువిభాగములుగ నుండును. కార్యకర్తృకమున రాష్ట్రపతియు, మంత్రిపరిషత్తును చేరి యుందురు. సమాఖ్యాపార్లమెంటులోను, ప్రాంతముల శాసనకర్తృకములలోను గల యెన్నుకొనబడిన సభ్యులు రాష్ట్రపతిని ఎన్నుకొందురు. ఇతడు ఐదుసంవత్సరములకాల మీ పదవియం దుండును. తిరిగి యెన్నికకు నిలవవచ్చును. 35 సంవత్సరముల వయస్సుగల ప్రతి భారతదేశపౌరుడును ఈ పదవికి ఎన్నుకొనబడవచ్చును. పదవిని స్వీకరించుటకుముందు ఈవ్యక్తి ధర్మబద్ధముగ పరిపాలనము సాగించెదనని ప్రమాణము చేయును. ఇందులకు వ్యతిరేకముగ నడచి, అక్రమ

ముగ ప్రవర్తించినయెడల పార్లమెంటు ఇతనిని పదచ్యుతుని చేయవచ్చును. పరిపాలనమంతయు నితని పేరనే జరుగును. పెద్దపెద్దయుద్యోగులందరు నితనిచేతనే నియమింప బడుదురు. వి దేశములతోడను, వారి రాయబారులతోడను సంబంధముల నితడే జరపును. పార్లమెంటును సమావేశపరచుట, దానికి సందేశముల నిచ్చుట, దానిని రద్దుపరచుట ఇతడే చేయవలసిన పనులు. దేశమునకు లోనుండిగాని, వెలుపలనుండిగాని ప్రమాదము కలిగించు పరిస్థితు లేర్పడినప్పుడు, ఇతడు సామాన్యపరిపాలనమును నిలుపుచేసి అవసరములగు నేర్పాట్లను చేయును. పార్లమెంటు సమావేశమైయుండనప్పుడు అవసరములగు శాసనముల నితడు ప్రవర్తింపచేయును. మంత్రులను నియోగించి, వారు సాగించు పరిపాలనమును పర్యవేక్షించుచుండును. కార్యకర్తృకమున రెండవభాగము మంత్రిపరిషత్తు. ఇందలి మంత్రులు తమ నిర్ణయముల నెప్పటికప్పుడు రాష్ట్రపతికి తెలియచేయుచు, అతని సూచనలను మన్నించుచు, పార్లమెంటుకు బాధ్యులై పరిపాలనమును నడిపించుచుందురు.

సమాఖ్యకంతటికిని పార్లమెంటు ప్రధానమైన శాసనకర్తృకము. ప్రజలయొక్క స్వామ్యము దీనియందు ప్రతిష్ఠింపబడి యుండును. ఇది యేపనినైనను చేయవచ్చును. దీని యధికారమునకు పరిమితి లేదు. ఈ పార్లమెంటులో ప్రజాసమితి, ప్రాంతీయసభ అను రెండుశాఖ లుండును. ప్రజాసమితిలో దేశమునందలి వయోజనులందరును కలిసి యెన్నుకొనిన ప్రతినిధు లుందురు. ఇందుపరిపాలనమునకును, ప్రజలయోగక్షేమమునకును సంబంధించిన ఏయంశమునుగూర్చియైనను

శాసనములు ప్రతిపాదింప బడవచ్చును. రెండవశాఖయగు ప్రాంతీయసమితిలో సమాఖ్యలో చేరిన ప్రాంతములప్రతినిధు లుందురు. వీరిలో ౧/3 వంతుమంది ప్రతిరెండుసంవత్సరముల కును విరమించి, క్రొత్తవారు వచ్చుచుందురు. ఈ శాఖలలోని కార్యకలాపమును నడిపించుటకు ప్రత్యేకముగ అధ్యక్షు లుందురు.

సమాఖ్యకంతకును పరమోన్నతన్యాయస్థానము న్యాయ కర్తృకము. ఇది పరిపాలన ప్రణాళికనుగూర్చి బయలువెడలు సందేహములను, ఒకప్రాంతమునకు నింకొక ప్రాంతమునకును గాని ప్రాంతములకును సమాఖ్యకునుగాని పేచీలను, ప్రాంత ములలోని ఉన్నతన్యాయస్థానములనుండి పునరాలోచనకు వచ్చు అభియోగములను పరిష్కరించును. ఈన్యాయస్థాన ములలోని న్యాయమూర్తులను రాష్ట్రపతి నియోగించును. అక్రమముగ వర్తించిన యెడల వారిని పార్లమెంటు పదచ్యు తులను చేయవచ్చును.

ప్రాంతముల పరిపాలనము.

భారతసమాఖ్యలో అనేక విధములగు ప్రాంతములు చేరియున్నవి. వీనిలో కొన్నిటికి గవర్నరులును, పూర్వము సంస్థానములుగనుండిన వానికి రాజప్రముఖులును అధిపతు లుగ నుందురు. రాష్ట్రపతి వీరిని నియోగించును. ఆతని వలెనే వీరును పరిపాలన నిర్వహణమునకు బాధ్యులై యుం దురు. ప్రాంతీయశాసనకర్తృకములు సమావేశమైయుండ నప్పుడు అవసరములగు శాసనములను నిర్మించుట, మంత్రి

లను నియోగించి వారి పరిపాలనము పర్యవేక్షించుట శాసన కార్యకమును సమావేశపరచుట మున్నగు విధులను వీరును నిర్వర్తింతురు. వీరికి సలహాల నొసంగుట కొక మంత్రిమండలి యుండును. ప్రాంతములలో కొన్నిట నొకే శాసనసభయు, కొన్నిటిలో రెండు శాఖలును గల శాసనకర్తృకము లుండును. వీనిలో ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధు లుందురు. ప్రతిప్రాంత మునకు ఒక ఉన్నతన్యాయస్థానముండును.

## ౪
## రష్యా.

ఐరోపాఖండమునందు ముఖ్యములైన దేశములలో రష్యా ఒకటి. ఇది నేడు యు. యస్. యస్. ఆర్. (U.S S. R.) లేక ప్రజాతంత్రి సోవియట్ రాష్ట్ర సమాఖ్య (United Soviet State Republic) అని పిలవబడుచున్నది. ౧౯౧౭ వ సంవత్సరమువరకును ఈ దేశము జార్ అను నిరంకుశపరిపాలకుని యేలుబడియం దుండెడిది. రష్యా ౧౯౧౪—౧౯౧౮ నడుమ జరిగిన మొదటి ప్రపంచయుద్ధమున జర్మనీపక్షమున పాల్గొనెను. ౧౯౧౭ లో మిత్రమండలివారు ఈ దేశము నోడించిరి. దానికి ఫలితముగ దేశమునందొక విప్లవము జరిగెను. నాటి జార్ అగు రెండవ నికోలస్ పదవీపరిత్యాగము చేసెను. ఆరు నెలలకాలము కెరెన్‌స్కీ పక్షమువారు తాత్కాలికముగ నొక ప్రభుత్వమును స్థాపించి నిర్వహించిరి. సైనికులును, కార్మికులు నాప్రభుత్వమును ధిక్కరించి మరియొక విప్లవము బయలుదేరదీసిరి. లెనిన్ దీనికి నాయకత్వము

వహించి, అధికారమును వశపరచుకొని రష్యాలో సోవియట్ రాష్ట్రమును నెలకొల్పెను. అప్పటినుండి నేటివరకును ప్రభుత్వవిధానమునం దెన్నియో మార్పులు జరిగినవి. అయినను ౧౯౩౬ లో అమలుపరుపబడి ౧౯౪౭ లో కొద్ది మార్పుల నందిన ప్రణాళిక నేడు అమలులో ఉన్నది. దానినిబట్టి యీ దేశపు పరిపాలన మీక్రిందివిధమున ఉన్నది.

సమాఖ్య, రాష్ట్రములు.

నేటి రష్యా ౧౬ సోషలిస్టుప్రజాతంత్ర సోవియట్ల సమాఖ్య. సమాఖ్య అధికారములు సవివరముగ పేర్కొనబడినవి. మిగిలిన అధికారము లన్నియు వైయక్తిక సోవియట్లకు వర్తించును. యుద్ధప్రకటనము, సంధి నిర్ణయము, విదేశములతోడి సంబంధములు, దేశరక్షణ, ఆర్థికప్రణాళికల నమలుపరచుట, బ్యాంకులు, రాకపోకలమార్గములు, మున్నగు నంశములు సమాఖ్యపరిపాలించువానిలో ముఖ్యములు. ఈ సమాఖ్యలో చేరియుండు సోవియట్‌లు యథేచ్ఛముగ దీనినుండి తొలగి పోవచ్చును.

శాసనకర్తృకము.

సమాఖ్యయొక్క శాసనకర్తృకమునకు సుప్రీంసోవియట్ (Supreme Soviet) అని పేరు. ఇందు సోవియట్ ఆఫ్ ది యూనియన్ (Soviet of the Union) అని ఒకటియు, సోవియట్ ఆఫ్ నేషనాలిటీస్ (Soviet of Nationalities) అని ఒకటియు రెండు శాఖలు కలవు. ఇందు మొదటిశాఖలో ౬౮౭ మంది సభ్యు లుందురు. వీరిని ప్రజలు ప్రతి 3, ౦౦, ౦౦౦ మందికిని

ధ్యత వహించును. ఈమండలి సమాఖ్యాపరిపాలనమును నిర్వ హించును. సమాఖ్యలో చేరియుండు సోవియట్ల మంత్రులు చేయు పనులు, తీర్మానములు సమాఖ్య కార్యక్రమము నకును, శాసనములకును విరుద్ధములైన యెడల వానిని నిలిపి వేయును.

## న్యాయకర్తృకము.

ఇందు పరమోన్నతన్యాయస్థాన మొకటి ఉండును. దీనిలో ౪౫ మంది న్యాయమూర్తులును, ౨౦ మంది ఎసెస ర్లును ఉందురు. వీరిని సుప్రీంసోవియట్ ఎన్నుకొనును. వీరి పదవులు ఐదుసంవత్సరములకాలము సాగును. ఇతర దేశము లలోవలె ఈ న్యాయస్థానమునకు సమాఖ్యాశాసనములను అక్ర మములని నిర్ణయించునధికారము లేదు.

## ప్రెసిడియం.

ఇది ఒక విలక్షణమైన సంస్థ. దీనిలో సుప్రీంసోవియట్ ఎన్నుకొనిన 33 మంది సభ్యు లుందురు. ఇది సుప్రీంసోవి యట్ను సమావేశపరచును; రద్దుచేయును. ఏ శాసనమును గురించియైనను జనవాక్యనిర్ధారణ చేయును. సుప్రీంసోవియట్ లేనప్పుడు మంత్రులను నియోగించును లేదా పదచ్యుతు లను చేయును. యుద్ధప్రకటన చేయును. రాయబారులను నియోగించును. మంత్రుల శాసనములలో అక్రమములగువా నిని రద్దుపరచును.

# ఆంధ్ర చంద్రికా గ్రంథమాల

## నియమములు

౧. ఈ గ్రంథమాలలో దేశచరిత్రలు, మహా పురుషుల జీవితములు, ప్రకృతి శాస్త్రములు, ఇతర విజ్ఞానాత్మక గ్రంథములు ప్రకటింప బడును.

౨. ఈ గ్రంథములన్నియు ప్రజా సాహిత్య సంబంధములుగా నుండి, సులభమైన వచనశైలిలో ఆకర్షణీయముగా ప్రకటింపబడును.

౩. గ్రంథములు పెద్దవిగా నుండక, వీలైనంతవరకు పరిమితమైన పుటలు కలిగి, అందరు కొనుటకు అందుబాటులో నుండులాగున ప్రకటింపబడును.

౪. ఈగ్రంథమాలకు చందా లేదు. మాసపత్రిక కాదు. గ్రంథము తయారు కాగానే చందాదారులకు వి. పి. గా పంపబడును.

౫. మా గ్రంథమాల ప్రచురణము లన్నియు గొనుటకు నొప్పుకొనువారు "శాశ్వతపు చందాదారు" లనబడుదురు.

౬. శాశ్వతపు చందాదారులు కాగోరువారు, తమ యామోదమును లిఖిత పూర్వకముగా తెలిపి ఒక రూపాయి ప్రవేశ రుసుముగా చెల్లించవలెను.

౭. శాశ్వతపు చందాదారులకు మా గ్రంథమాల పుస్తకముల వెలలో నాల్గవభాగము తగ్గించి గ్రంథములు తయారు కాగానే వి. పి. గా పంపబడును. పోస్టుకర్చులు చందాదారులే భరించవలయును.

౮. ఇంతవరకు ఆంధ్ర వాఙ్మయములో లేని గ్రంథములే ఇందు ప్రకటింపబడును. ఈ గ్రంథములలో విషయవర్ణనకు సంబంధించిన పటములు, గ్రంథకర్తల పటములు ఉండును.

౯. ఆంధ్రభాషకు పుష్టి కలిగించుటయు, ఆంధ్రులలో విజ్ఞాన చంద్రికలను ప్రసరింపజేయుటయు మా యుద్దేశము. డబ్బు సేకరింపవలెనని మా యుద్దేశము కాదు.

౧౦. ఆంధ్రభాషాభిమాను లందరును గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులుగా చేరి, మా భాషా వ్యవసాయమునకు ప్రోత్సాహ మొసంగి, ఆంధ్రసరస్వతీదేవి ఆరాధనమునందు పాల్గొని కృతకృత్యులు గావలయునని మా విజ్ఞాపన.

ఇదివరకు ప్రకటింపబడిన గ్రంథములు.

౧. విస్మృత సామ్రాజ్యములు.

ఇదియొక చరిత్రగ్రంథము. నవలవలె మనోరంజకముగా నుండు కథాంశములతో నొప్పారుచున్నది. ఇందు కాల్డియా, బాబిలోనియా, అస్సీరియా యను ప్రాచీన సామ్రాజ్యములచరిత్ర వర్ణింపబడినది.

ఈ సామ్రాజ్యములు నాలుగయిదు వేల సంవత్సరముల క్రిందట మిగుల వైభవదశలోనుండి కాలపురుషుని ప్రభావమున మాటుపడిపోయినవి. చరిత్రకారుల అవిశ్రాంత పరిశోధన ఫలితముగా వీటి అద్భుతకథనము బయటపడినది. ఇంగ్లీషులోని పెక్కు ఉద్గ్రంథములను పరిశీలించి, ఈ సామ్రాజ్యముల సభ్యత, శిల్పసంపద, మత విశ్వాసములు, ఆచార

ములు, విజ్ఞానము, శౌర్యపరాక్రమములు మున్నగు పెక్కు విషయములను గూర్చి మనోహరముగా, అందరకర్థమగునట్లు ఈ గ్రంథము రచింపబడినది. ఆ కాలపు కళలు, దేవతలు మొదలగువానిని దెలుపు పటములు మంచి ఆర్టుపేపరుమీద ముద్రింపబడినవి కలవు. ప్రారంభమున ప్రాచీనమానవుడు నాగరికత శిఖరారోహణమునకు ఎట్లు ప్రయత్నముచేసెనో చక్కగా వర్ణింపబడినది.

గ్రంథకర్త: శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం, ఎం. ఏ. గారు.

పుటలు ౨౬౦, వెల చందాదారులకు రు ౨-౦-౦

ఇతరులకు, రు ౨-౧౨-౦

(ప్రతులు అయిపోయినవి)

## ౨. తెలంగాణా ఆంధ్రోద్యమము

### (మొదటి భాగము)

ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో నిది రెండవకుసుమము. ఇది తెలంగాణములోని ఆంధ్రోద్యమమునకు సంబంధించిన చరిత్రగ్రంథము. ఇచ్చట ఆంధ్రులు తాము ఆంధ్రులమను సంగతి నెరుంగక, సాంఘికముగ, రాజకీయముగ, భాషావిషయికముగ, వెనుకబడియున్న తరుణమున వారిని మేల్కొల్పిన పవిత్రోద్యమ చరిత్రమిది. ఈ ఉద్యమ ప్రభావమున ఆంధ్రులకు రాజకీయముగ అస్తిత్వము లభించినది. ఆంధ్ర భాషకు ప్రచండ ప్రోత్సాహము కలిగినది. ఆంధ్రసంఘము నకు గట్టి కట్టుదిట్టము లేర్పడినవి. ఇప్పటి వివిధోద్యమముల

యందు ఆంధ్రులు చూపుచున్న చైతన్యమునకు బీజములు నాటి దోహదము కావించినదీ ఆంధ్రోద్యమమే.

ఈ ఆంధ్రోద్యమ రథమునకు బుజాలు వేసిన మహనీయు లక్కుపి చక్కగా వర్ణింపబడినది. వారిపటములును ముద్రింప బడినవి. అతిశయోక్తులు లేకుండ, యథార్థ విషయములు మాత్రమే సప్రమాణములుగా వ్రాయబడినవి. ఈగ్రంథమును ఆంధ్రులందరు చదివితీరవలయును.

గ్రంథకర్త: శ్రీ మాడపాటి హనుమంతరావుగారు.

పుటలు ౧౫౨. వెల చందాదారులకు రు ౧—౮—౦
ఇతరులకు ౧—౨—౦—౦

## 3. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

(మొదటి భాగము)

అతి పురాతన కాలమునుండి క్రీ. శ. ౧౮౦౦ వరకు మన మాతృభాషయగు నాంధ్రమున, సాహిత్యము పొందిన వివిధ దశలు ఈ గ్రంథమున చక్కగ విశదీకరింపబడినవి. ఏతద్గ్రంథ ప్రత్యేకత్వము, ఏతద్గ్రంథకర్త ప్రతిభ ఆంధ్రలోక ప్రశంసను పొందదగియున్నవి. ఇందభివర్ణితములైన కళాక్షేత్రముల ప్రశంస, వచనవాఙ్మయ విన్యాసము, తెలంగాణకవుల యుదంతము, ఆంధ్రకవయిత్రుల ముచ్చట, చారిత్రిక కావ్యముల ధోరణి, యక్షగానముల సంవిధానము, శతకవాఙ్మయపు రీతులు, గేయవాఙ్మయ సౌందర్యము, ఇత్యాది ప్రకరణ

ములు ఆంధ్రవాఙ్మయముయొక్క వైశాల్యమును, శాఖలను, అభిరుచులను, గాంభీర్యమును, శోభను ప్రకాశమానము గావించుటకు ఎంతయు తోడ్పడుచున్నవి. శైలి మృదుమధురముగ, ఇంపై యలరారుచున్నది. ఆంధ్రజనులు ఇందలి సాహిత్యచరితామృతమును గ్రోలి యానందింతురుగాక!

కర్త: ఆచార్య, ఖండవల్లి లక్ష్మీరంజనము గారు. ఎం. ఏ,

పుటలు ౪౭౫. వెల చందాదారులకు రు ౨-౪-౦

ఇతరులకు రు ౩-౦-౦

(సాదాప్రతులు అయిపోయినవి. బైండుప్రతులకు రు ౦-౬-౦ అధికము)

### ౪. ప్రాచీనాంధ్రనగరములు

(మొదటి భాగము)

ఇందు అలంపురము, ఆనగొంది, కల్యాణి, గోలకొండ, పానుగల్లు, ప్రతిష్ఠానము, భోనగిరి, రాచకొండ, వరంగల్లు, వేల్పుకొండ అన్ని పండ్రెండు నగరముల చరిత్ర కలదు. పూర్వాంధ్రుల వైభవమును, ధార్మిక, రాజకీయ, శిల్పకళా చాతుర్యములను జాటెడు మహత్తరమయిన చారిత్రక గ్రంథము.

కర్త: పండిత, ఆదిరాజు వీరభద్రరావుగారు.

పుటలు ౧౪౦ వెల చందాదారులకు రు ౧-౮-౦

ఇతరులకు రు ౨-౦-౦

~~(ప్రతులు అయిపోయినవి)~~

## ౫. తెలంగాణా ఆంధ్రోద్యమము

(రెండవ భాగము)

దీనిలో తెలంగాణపు పదునెనిమిదివత్సరముల ఆంధ్రోద్యమచరిత్ర సప్రమాణముగా ౨౨ ప్రకరణములందు వర్ణితమైనది. ఇంచుమించు ౪౦౦ పుటలుగల ఈ పుస్తకములో ౧౩ ఆంధ్రమహాసభలవివరములును, పది ఆంధ్రమహిళామహాసభల సంగ్రహ వివరణమును కలవు. పదుగురు అధ్యక్షమహాశయులయు, ఎనిమిదిమంది అధ్యక్షురాండ్రయొక్కయు, కొన్ని సమావేశములయొక్కయు, సుప్రసిద్ధులగు ఆంధ్ర ఆంధ్రేతర మహాశయులయొక్కయు, సోదరీమణులయొక్కయు పటములు దీనిశోభను ఎన్నియోరెట్లు పెంపొందించుచున్నవి. ఆంధ్రోద్యమముయొక్క రెండదశలో కలుగుచు వచ్చిన మార్పులును, మహాసభను కమ్యూనిస్టులు వశపరచుకొనిన పిదప దాని పునరుద్ధరణమును, ప్రభుత్వమువారి విధానమునందు కలుగుచు వచ్చిన మార్పులును చక్కగా విశదీకరింపబడినవి. అనుబంధమున ౧౩ ఆంధ్రమహాసభలలో అంగీకరింపబడిన తీర్మానముల మూలము, మహాసభల వివరము యథాతథముగ గలదు. అందరును చదివి యానందింపదగిన పుస్తకము.

కర్త: శ్రీ మాడపాటి హనుమంతరావుగారు. పుటలు ౪౦౦ వెల చందాదారులకు, రు ౨-౮-౦, ఇతరులకు ౩-౬-౦,

## ౬. రాజకీయ పరిజ్ఞానము.

రాజకీయ శాస్త్రజ్ఞానమునకు పెన్నిధి యనదగిన ఈ పుస్తకము నిజాముకాలేజీలో రాజకీయశాస్త్ర అధ్యాపకులుగా నున్నట్టియు, ఉత్తమగ్రంథరచయితగను, మహావక్తగను, ఆంధ్రదేశమున ప్రసిద్ధిగాంచినట్టియు మహాశయునిచే వ్రాయబడినది. దీనిలో రాజకీయవిజ్ఞానము, రాష్ట్రోత్పత్తి, రాష్ట్రలక్ష్యము, రాష్ట్రప్రవృత్తి, రాష్ట్రనిర్మాణము, కార్యకర్తృకము (Executive), రాష్ట్రభేదములు, సమత, స్వేచ్ఛ, స్వామ్యము, మున్నగు ప్రకరణములలో ఈ శాస్త్రసంబంధములగు సర్వవిషయములు సులభమగుభాషలో బోధింపబడినవి. అనుబంధమున (౧) ఇంగ్లండు (౨) అమెరికా సంయుక్తరాష్ట్రములు (3) భారతదేశము (౪) సోవియట్ రష్యా అనువాని రాజ్యాంగవిధానము సంగ్రహముగా చూపబడినది. మొత్తముమీద నిది రాజకీయములు బాగుగా దెలిసికొనగోరువారికిని, ఇతరులకును అత్యంత ఉపయోగకరమగు గ్రంథము.

కర్త; డాక్టరు మారేమండ రామారావుగారు. ఎం. ఏ, ఎల్. టి., పి. ఎచ్. డి.

| | |
|---|---|
| వెల చందాదారులకు. | రు ౦—౧—౨—౦ |
| ఇతరులకు: | రు ౧—౦—౦ |

## (౭) పౌరశాస్త్రము

నేటికాలమున అత్యంతోపయోగకరమగు ఈ గ్రంథమును నిజాము కాలేజిలో ఆవిషయమును బోధించు అధ్యా

పకులుగానుండి ఇటీవల ప్రభుత్వపారిశ్రామిక శాఖయందు గొప్పయుద్యోగమున నున్న శ్రీ డాక్టరు రాంపల్లి విశ్వేశ్వర రావుగారు, ఎం. ఏ, బి. టి, పి ఎచ్. డి. గారు రచించినారు. ముద్రణమున నున్నది. నెలదినములలో వెలువడగలదు.

రాబోవు గ్రంథములు.

౧. వైజ్ఞానికుల జీవితములు,
కర్త: బి. వి. రమణారావుగారు, ఎం. ఎస్సి,

౨. మాదన మంత్రి:
కర్త: భూపాలరావుగారు, ఎం. ఏ.

3. రోమక సామ్రాజ్యచరిత్ర:
కర్త: నూకల నరోత్తమ రెడ్డిగారు, ఎం. ఏ.

౪. ఆంధ్రసాహిత్య చరిత్ర (రెండవ భాగము):
కర్త: ఆచార్య, ఖండవల్లి లక్ష్మీరంజనముగారు ఎం. ఏ.

"ఆంధ్రకుటీరము"
సుల్తాన్ బజారు
హైదరాబాదు—దక్న్
౧౫—౨—౧౯౪౦

మేనేజరు,
ఆంధ్రచంద్రికా గ్రంథమాల.

